# కాకతీయ శాసన సాహిత్యము




పుచ్చా ... శాస్త్రి





ప్రచురణ

ఆంధ్రసారస్వత పరిషత్తు

...క్, హైదరాబాదు.



1981

# కాకతీయ శాసన సాహిత్యము



సంకలన కర్త

పుచ్చా వాసుదేవబ్రహ్మశాస్త్రి





ప్రచురణ

ఆంధ్రసారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్, హైదరాబాదు.

1981

# విషయసూచిక

# తొలి పలుకులు

తెలుగు భాషా, సాహిత్యాలకు, చరిత్రకు సంబంధించిన విషయాలపైన ప్రసిద్ధ పండితులచేత ఉపన్యాసాలు ఇప్పించటం, ఆ ఉపన్యాసాలను పుస్తక రూపంలో ప్రకటించటం ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించే కార్యక్రమాలలో ప్రధానమైన భాగం. అట్లా వెలువడిన గ్రంథాలే 'ఆంధ్ర మహాభాగవతోపన్యాసము', 'ఆంధ్ర మహాభారతోపన్యాసము', 'తెలుగులో పదకవిత' మొదలైనవి. ఆ పరంపరలోనే ''కాకతీయ శాసన సాహిత్యము'' అనే ఈ గ్రంథాన్ని పరిషత్తు వెలువరిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ఆర్కియాలాజికల్ డిపార్ట్‌మెంట్‌లో డిప్యూటీ డైరెక్టర్ డా॥ పుచ్చా వాసుదేవపరబ్రహ్మశాస్త్రి గారు 1979 డిసెంబర్ నెల 14, 15 తేదీలలో వరుసగా 'సంస్కృత శాసన సాహిత్యం' 'తెలుగు శాసన సాహిత్యం' అనే అంశాలపైన ప్రసంగించారు. మొదటి రోజు సమావేశానికి ప్రొఫెసర్ సరోజినీ రెగానిగారు, రెండవ రోజు సమావేశానికి డా. ఎం. రాధాకృష్ణశర్మగారు అధ్యక్షత వహించిరి.

సాధారణంగా వచనంలో ఉన్న శాసనాలు వ్యావహారిక భాషా పదాలతో కూడి ఉండి చరిత్ర నిర్మాణానికి ఎంతో ఉపకరిస్తవి. కాని శాసనాలలో కావ్యాలను పోలిన రచనలు కూడా కనిపిస్తవి. కాకతీయుల కాలంనాటి శాసనాలలో సాహిత్యంగా గుర్తించ దగిన రచనలు ఎన్నో కనిపిస్తవి. అవి సంస్కృతంలోను, తెలుగులోను కూడా ఉన్నవి. ఇతరత్ర ప్రత్యేక గ్రంథాలు లేకుండా శాసనాల ద్వారానే కవులుగా గుర్తించదగినవారు ఎందరో ఉన్నారు. ఈ అంశాలపైన ప్రత్యేక పరిశీలనచేసి శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారు ఈ ఉపన్యాసాలు రచించినారు. ఇవి ఆంధ్ర సాహిత్యలోకానికి ఎంతో ఉపకరిస్తాయని ఆశిస్తున్నాము.

ఉపన్యాసాలు ఇవ్వడమే కాకుండా, ఉపన్యాసవ్యాసాలను ప్రచురణకోసం మాకందజేసిన శ్రీ పరబ్రహ్మశాస్త్రి గారికి, ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్సు వారికి మా ధన్యవాదాలు.

గడియారం రామకృష్ణశర్మ

అక్టోబరు, 1981. కార్యదర్శి

# తొలి మాట

ప్రాచీన కాలమునుండి మన దేశమున మహనీయులు కొందఱు ఆలయములు, స్తూపములు, ఆరామములు, వాపీకూప తటాకములు, గ్రామములు మొదలగునవి నిర్మించుచు, ఆ సత్కార్యములు తమ సమకాలికులకే గాక తమ తరువాత రానున్న ప్రజలకు కూడ నుపయోగించుచుండవలెనను తలంపుతో నా విషయమును శిలలపైనో రాగిరేకులపైనో వ్రాయించెడివారు. చేసిన దానాది సత్కార్యముల దామే గీర్తించుకొనరాదను ధర్మశాస్త్ర నిషేధము ననుసరించి అనేక నిర్మాణములపైన, తటాకాదుల దగ్గఱ శాసనాలు వ్రాయించక పోవుట కూడ కలదు. అయినను కొందఱు వాటిని ముందుతరముల వారు కాపాడు చుండుటకై వ్రాయించుచుందురు. రాజులు తమ అజ్ఞాపూర్వకముగ శాసనములు స్థాపించుచు వాటిలో ప్రశస్తి రూపమున తమ ఘనతను గూడ గీర్తికాములై వ్రాయించుకొనెడి వారు. వారి కానాడు చరిత్రదృష్టి లేకున్నను వారి శాసనములు కొంతమటుకు చరిత్రాధారము లగుచున్నవి. ఆనుషంగికముగ నందలి గద్య రచనలుగాని పద్యరచనలుగాని ప్రశస్తి దృష్టితో రచింపబడుటనుబట్టి కొన్ని రమణీయముగ సహృదయుల కానందమొసగు సాహిత్యము గలిగి యుండును. ఆంధ్రదేశము కాకతీయులనాడు విద్యా సంస్కృతులతో బరిపుష్టమై యితర ప్రాంతములతో దీసిపోక ప్రత్యేకత జూపగలిగెను. ఆ రాజుల ఆదరాభిమానము లతో ననేక వేదశాస్త్ర విద్వాంసులు, కవిశ్రేష్ఠులు ఆంధ్రావని నలంకరించిరి. అట్టి విద్వదవతంసుల గ్రంథములు స్వల్పసంఖ్యలో మాత్రమే లభించుచున్నవి. కాని ఆనాటి శాసనముల మూలమున రచయితలుగ గొందఱు, దానప్రతి గ్రహీత లుగ గొందఱు తెలియవచ్చుచున్నారు. విద్దనాచార్యుడను మహావిద్వాంసుఁడు ప్రతాపరుద్రుని కాలమున ఉత్తరేశ్వర గ్రామదానమున ప్రతిగ్రహీతగ జెప్ప బడెను. అతడు రచించిన ప్రమేయ చర్చామృతమను గ్రంథమొకటి శాస నములో విశేషముగ ప్రశంసించబడెను. ఆ గ్రంథము మనకు లభ్యమగుటలేదు. ఆయనతోబాటు శతాధిక సంఖ్యగా విద్వాంసులు ప్రతిగ్రహీతలై యుండిరి. అందనేకులు ఘటశాసులు వేదవిదులు. వారిలో గొందఱైనను గ్రంథములు

రచించియుందురు. కాని మనకు లేవు. సాహిత్య దృష్టిలో పరిగణించదగిన కాకతీయ శాసనముల రచయితలు పేర్కొనబడి కొందఱు, పేర్కొనబడక కొందఱు తెలియవచ్చుచున్నారు. ఆ రచనలు పరిమాణమున స్వల్పములు. అందును కొన్ని శిథిలములగుటవలన నసంపూర్తిగ నున్నవి. వాటి నుండి కొన్ని సంస్కృత శ్లోకములను, కొన్ని తెలుగు పద్యములను తీసి ఆంధ్రావనిలో నొకప్పుడు ప్రఖ్యాతిగాంచి విస్మృతులైన విద్వత్కవి పుంగవుల స్మృతి చిహ్నముగ నిందు గూర్చితిని.

ఇందు దహరించిన భాగములన్నియు కీ. శే. శ్రీ జయంతి రామయ్య పంతులుగారి దక్షిణ భారత శాసన సంపుటి-10; వారిదే శాసన పద్యమంజరి; కీ. శే. డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారి వరంగల్లు జిల్లా శాసన సంపుటి; కీ. శే. డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారి కార్పస్ (తెలంగాణా శాసన సంపుటి) రెండవ భాగము; శ్రీ గడియారము రామకృష్ణశర్మగారి తెలంగాణా శాసనములు రెండవ సంపుటము; నేను సేకరించిన కరీంనగరు జిల్లా శాసన సంపుటి, సిద్ధోద్వాహము మున్నగు ప్రకటిత శాసన గ్రంథముల నుండి గ్రహించితిని. ఆ విద్వాంసులందరికి వినయపూర్వక కృతజ్ఞతలు దెలుపుచుంటిని.

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వాహకులు, సహృదయులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, పూజ్యులు శ్రీ గడియారము రామకృష్ణశర్మగారు, డా॥ కె. కె. రంగనాథాచార్యులుగారు నాకీయవకాశమిచ్చి ప్రోత్సహించినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

సంకలకర్త

శ్రీ సరస్వత్యైనమః

హంసాః పద్మాసనాసీనా యదంతస్సముపాసతే।
పరామృత రసస్యన్ది స్రోత స్సారస్వతం స్తుమః॥

# శాసనములు - చరిత్ర - సాహిత్యము

భారతీయ వాఙ్మయములలో సంస్కృత మాసేతు హిమాచలం వ్యాప్తమై చిరకాలము ప్రముఖ స్థాన మాక్రమించెను. ప్రాంతీయ భాషలు కూడ పరిమిత పరిధులలో సంస్కృతమువలెనే ప్రజావసరములు దీర్చునట్టి వాఙ్మయములుగ నభివృద్ధి నొందెను. సంస్కృతములోను దేశభాషలలోను శాసన వాఙ్మయ మొక విశేషస్థానమందున్నది. శాసనములు సాధారణముగ చరిత్ర రచన కుపయుక్తమగు సమాచారము కొంత మనకందించును. అందువలన చరిత్ర రచయిత లట్టి సమాచారమును మాత్రము శాసనములనుండి స్వీకరించుచుందురు. విషయాంతరములనంతగా పట్టించుకొనరు. శాసనము లందుండు ప్రాచీన భాష, లిపి సులభ గ్రాహ్యముగ నుండకపోవుటవలనను, అనేక శాసనములు భిన్నమైగాని, అక్షరములు స్పష్టముగనుండకగాని పూర్తియగు శాసనమూలము లభించక పోవుటవలనను చదువుటకంత సులభముగ నుండవు. వీటికితోడు అప్పటి రచయితల, లేఖకుల ప్రమాదములేగాక ఇప్పటి పరిష్కర్తల ప్రమాదములు గూడ బహుళముగనుండి ప్రకటిత శాసనములు గూడ చదువుట కాసక్తిజనకముగ నుండవు. అందువలన పలువురు విద్వాంసులు శాసనముల నంతగా జదువరు. ఇంక వాటిలోనుండు విషయము జూతమన్నను, అవి ధర్మ శాస్త్రాదులవలె మానవ జీవితాదర్శములను బోధించవు, ఇతిహాసములవలె పండిత పామరులకు గ్రాహ్యమగు ఇతివృత్తములను బోధించవు, కావ్య నాటకములవలె రమణీయార్థ ప్రతిపాదకములై సహృదయ మనోరంజకముగ నుండవు. ఇట్లు ప్రభు, మిత్ర, కాంతా సమ్మితమగు త్రివిధ వాఙ్మయములో దేనియందును శాసనములు గణించబడవు. కాగా దేశకాల భేదమును తెలుపుచు, కొంత

రాజకీయ సమాచారమును, కొంత సాంఘిక సమాచారమును, కొంత మత సమాచారమును, కొంత ఆర్థిక సమాచారమును తెలుపుచుండును. సంక్షిప్తముగ నాయాశాసనకాలములందున్న ప్రజాజీవనమును గూర్చి తెలిసికొనుటకు శాసనము లుపకరించును. ఈ విధముగ చరిత్రరచన కాధారములలో నొకటిగ శాసనములు గ్రహింపబడుచున్నవి.

శాసన భాష జనసామాన్యము మాట్లాడుకొను వ్యావహారిక పదములతో యథార్థ పరిస్థితులను దెలుపుచుండును. కావ్యములవలె వ్యంగ్యార్థములకు, అతిశయోక్తి వక్రోక్త్యాద్యలంకారములకు ప్రాధాన్య మివ్వక నిజమగు ప్రజాజీవిత విశేషముల గూర్చియే యెక్కువ శాసనములుండును. ఉదాహరణమునకు ఒక దేవాలయములో నొక భక్తు డొక పుణ్యకాలమున దేవునికి దీపదానము చేసినట్లొక శాసనముండును. ఈ శాసనములో కావ్యశ్లోకమువలె పదేపదే చదివి ఆస్వాదించవలసిన రమణీయత యేమియు నుండదు. అప్పటి మతాచారము, దీపమునకగు వ్యయము గద్యాణముల రూపముననో, ఆవు నేయిగనో, గొఱ్ఱెల నేయిగనో యిచ్చెడివారన్న విషయము మనకు తెలుస్తుంది. నిజమున కాభక్తుడాశాసనము ద్వారా అప్పటివారికిగాని, ముందువారికిగాని కవిత్వము వినిపించు నుద్దేశముతో దానిని వ్రాయించలేదు. తనుచేసిన ఆ కొద్దిపాటి సత్కార్యము నెవరు భంగపఱచకుండుటకును, ఆలయ ధర్మకర్త లాధర్మము నెల్లకాలము తప్పక పాటించుటకును, నేయి పోయునట్టి గొల్లవాడు తన పుత్రపౌత్రపారంపర్యముగ అందు చెప్పబడిన నేతిని గుడిలో నొప్పగించుటకును దానిని శిలాక్షరములుగ వ్రాయించెను. దీని మూలమున పేరు ప్రతిష్ఠలు చిరకాలముండు ననెడి యాశకూడ నతనికి లేకపోదు. ఎక్కువ శాసనము లిట్లే యుండును. కాని కొద్ది శాసనములు రమణీయమగు కావ్యశైలిలో రచింపబడినవి కూడ గలవు. సాతకర్ణి భార్య నాగనిక నానెఘాటు గుహలో వ్రాయించిన శాసనము మొదలుకొని రాజప్రశస్తులుగల శాసనము లనేకము లభ్యమగుచున్నవి.

ప్రాచీన కాలమునుండి మన దేశములో కవులు రాజుల నాశ్రయించుట రాజులు కవులను పోషించుట ఆచారముగా వచ్చుచున్నది. ఈ పోష్య పోషక సంబంధము ఆయా విద్వత్కవుల ప్రతిభావిశేషమును బట్టి ఆయా రాజుల

సహృదయతను బట్టి యుండును. భోజుడు, సర్వజ్ఞ సోమేశ్వరుడు, పెద కోమటివేముడు, కాటయవేముడు, సర్వజ్ఞసింగ భూపుడు, శ్రీకృష్ణదేవరాయలు మఱెందరో విద్వన్నృపులు పండిత కవుల నాదరించి, చిరకీర్తి నార్జించిరి. రాజాస్థానములలో పండితులు కవులు లేకుండుట పెద్దలోపముగ నానాడు భావించెడివారు. ఇతర రాజుల నాశ్రయించిన గొప్ప విద్వాంసులు కవులు తమను సందర్శించుటకై వచ్చినప్పుడు రాజులు వారికి తమ విద్వత్కవి సభలలోనే దర్శన మిచ్చెడివారు. మనుమసిద్ధిరాజు పనుపున నోరుగల్లున కేతెంచిన తిక్కన సోమయాజికి గణపతిదేవు డెట్టిసభలో దర్శన మొసగినది ముందు జెప్పబడును.

కాకతి రుద్రదేవునికి సమకాలికు డసదగిన పృథ్వీదేవుడను కలచురి రాజు క్రీ.శ. 1148-49 లో కాశలుడను కవిచేత నొక శాసనము వ్రాయించెను. అందులో ఆ కవి యీ విధముగ జెప్పెను. (ఎ.పి.ఇం. 23, పుట 281)

శ్లో॥ కుర్వన్తు కీర్తనశతాని రణాంగణేషు
మథ్నన్తు వైరినికరం ధన ముత్సృజన్తు।
కాలాన్తరే తదఖిలం ప్రబలాన్ధకార
నృత్యోపమం కవిజనై రనిబధ్యమానమ్॥

యుద్ధరంగములందెన్ని విజయ భేరులు మ్రోగించినను, ఎంతమంది శత్రువులను వధించినను, ఎంత ధనము దానమొసగినను కవీశ్వరులచే గావ్యముగ గీర్తింప బడనిచో ఆ ఘనకార్యములన్నియు నీకాల ప్రవాహములో అన్ధకార నృత్యము వలె నదృశ్యమైపోవును.

మఱియొక కవి (నాన్దేడ్ జిల్లా శాసన సంపుటి. నెం. 33.)

శ్లో॥ కావ్యామృతై ర్వాథ కథామృతై ర్వా
అద్యాపి జీవన్తి మృతా మహీశాః।
పూర్వ ప్రసాదా త్కవి పుంగవానాం
నృపస్య యస్మా త్కవిరేవ మిత్రమ్॥

ఎన్నడో మరణించిన రాజులు కావ్యామృతములచేతగాని, కథామృతములచేత గాని యిప్పటికిని జీవించియున్నారు. అట్టి యమృతమును ప్రసాదించి వారి నిప్పటికి జీవింప జేయుచున్న కవియే నృపునకు మిత్రుడు.

గణపతిదేవుని ఆస్థానకవి చక్రవర్తి యింకొక అడుగుముందుకువేసి తాను నిజముగ శాసనము జెప్పుచున్నను ఇందు మొట్టమొదట జెప్పిన 'హం సాః పద్మాసనాసీనాః' అను శ్లోకములో సారస్వత స్తుతి జేయును. దీని వివరణము ముందు జెప్పబడును.

కనుక రాజులందరు తమఘనత చిరస్థాయిగ గీర్తింపబడుటకై కవి పుంగవులచేత శాసనములందు ఘనముగ బ్రశస్తులు వ్రాయించుకొనిరి. అందు స్వల్ప విజయములు ఘనవిజయములుగను, అల్పతటాకములు సముద్రములు గను, ఉన్నను లేకున్నను కీర్తి దిగంత వ్యాప్తముగను ఇంకా యెన్నెన్నో ఉపమానములు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు, శ్లేషలు మున్నగు అర్థాలంకార ములు, యమకానుప్రాసాది శబ్దాలంకారములు తమ ప్రతిభకొలది కల్పించి రాజులకు ప్రశస్తులతో శాసనాలు వ్రాశారు. ఆ ప్రశస్తులనుండి కల్పితాంశములు విడిచి యథార్థాంశములు మటుకు గ్రహించుచు చరిత్ర రచయితలు చరిత్రలు వ్రాయుచుందురు. కావ్యాంశము నంతగా పరిగణించరు. చరిత్రతో గలిసియుండి యస్పష్ట పాఠములతో దోషభూయిష్ఠమై యుండును గనుక నాప్రశస్తులు కావ్య రసాస్వాదనకంతగా రుచింపమిచే సాహిత్యప్రియుల కాకర్షకముగ నుండవు. శాసన సాహిత్య మావిధముగ చరిత్ర పరిశోధకులకు, సాహిత్య పరిశోధకులకు రుచింపక ఉపేక్షించబడి రాళ్ళమీద రాగిరేకుల మీద ఇంకను సుపరిష్కృతములు గాక మిగిలియున్నవి.

కాకతీయుల కాలము—

| | | | | | |
|---|---|---|---|---|---|
| రెండవ ప్రోలరాజు | క్రీ.శ. | 1116 | నుండి | 1157 | వఱకు |
| రుద్రదేవుడు | ,, | 1158 | ,, | 1195 | ,, |
| మహాదేవుడు | ,, | 1196 | ,, | 1198 | ,, |
| గణపతిదేవుడు | ,, | 1199 | ,, | 1262 | ,, |
| రుద్రమీదేవి | ,, | 1262 | ,, | 1289 | ,, |
| ప్రతాపరుద్రుడు | ,, | 1290 | ,, | 1323 | ,, |

ఈ రాజన్యుల రాజ్యకాలములోని శాసనము లనేకము వెలువడినవి. అందు తాము, తమ సామంతులు, సేనానులు, మంత్రులు స్థాపించిన శాసనములు

కొన్ని విద్వాంసులగు కవులచే రచింపబడెను. రుద్రదేవుడు హనుమకొండ వేయి స్తంభాల గుడి యొద్ద వేయించిన శాసనమును అచింత్యేంద్రయతి రచించెను. అది యొక చిన్న కావ్యము. అలహాబాదులో సముద్రగుప్తుడు వ్రాయించిన శాసనము హరిషేణుడను విద్వాంసుడు, మంత్రి రచించుటచేత దానిని హరిషేణప్రశస్తి యని రచయిత పేరుతో చెప్పుట కూడ గలదు. అట్లే నీ వేయిస్తంభాల గుడి శాసనమును గూడ నందలి రచనా విశేషమును బట్టి అచింతేంద్రప్రశస్తి యనుట కూడ నుచితమనిపించును. రుద్రదేవుని కాలములో పేర్కొనదగిన చక్కని తెలుగు శాసన మొకటి కలదు అది బెక్కల్లు శాసనము. క్రీ. శ. 1175 లో గద్య పద్యాత్మకమగు చక్కని గ్రాంథిక తెలుగులో రచింపబడిన దీశాసనము. రచయిత పేరు చెప్పబడలేదు. నన్నయభట్టు తరువాత నూతేండ్లు గడచిన పిదప శివతత్త్వసారము వంటి శైవ రచనలు తప్ప వేరొండు చెప్పదగిన తెలుగు గ్రంథములు లేని కాలములో తెలంగాణములో నిట్టి గ్రాంథిక రచనగల శాసనము తెలుగు వాఙ్మయ పరిశోధకులకు ముఖ్యమైనది. నన్నయ చూపిన మార్గములో తత్సమములతో గద్య పద్యములు రచించుట యిందు గానవచ్చును.

గణపతిదేవుని కాలమునకు జెందిన గ్రంథ రచయిత లరుదు. తిక్కన సోమయాజి నెల్లూరు నుండి గణపతిదేవుని దర్శనార్థమై మనుమసిద్ధి పనుపున వచ్చెనే కాని కాకతీయ రాజాస్థానములోని వాడు కాదు. అయిననేమి ? తన యాస్థానమున కూడ ఆ కవిబ్రహ్మకు దీటగు విద్వత్కవులు గలరనిపించునట్లు విద్వత్ప్రకాండుల ననేకుల నాదరించి సన్మానించిన నృపశేఖరుడు గణపతిదేవుడు. ఆ చక్రవర్తి ప్రక్కన ఒక కవిచక్రవర్తి, ఒక త్రిభువన విద్యాచక్రవర్తి, ఒక అభినవమయూరుడు, ఒక బాలభారతి, యింకెందరో విద్వత్కవి పుంగవులు సభామండపమునం దలంకరించియుండువారు. వీరి కవితా ప్రతిభ యెట్టిదో ముందు జూడగలము. రాయగజసాహిణి జాయసేనాపతి నాట్యలక్షణ గ్రంథ రచన చేయుటగాక కవి సభాశిఖామణి యని ప్రశంసించబడెను.

రుద్రమదేవి, ప్రతాపరుద్రుల కాలములో విద్యానాథుడు, రాజరుద్రుడు మున్నగు గ్రంథ రచయితలు వారి గ్రంథములబట్టి తెలియవచ్చుచున్నారు. అట్టి వారిలో విద్దనాచార్యుడు, అతని శిష్యులలో పిన్నయాచార్యుని కొడుకగు రుద్రదేవుడు గొప్ప విద్వాంసులు, కవులు. విద్దనాచార్యుడు ప్రమేయచర్చామృత

మను గ్రంథము రచించెనట. అది లభ్యమగుటలేదు కాని దాని గొప్పతన మధిక ముగ ఉత్తరేశ్వర శాసనమందు చెప్పబడెను. రుద్రయమంత్రిని ప్రశంసించుచు ఈ శ్లోకములు గూడ నందే గమనించదగియున్నవి. (ఎపి.ఇం.88, పుటలు 87-88)

శ్లో॥ యత్కృతం చోద్యమన్యోనో పరిహర్తుం ప్రగల్భతే ।
యత్కృతే పరిహారేఽపి నాన్యశ్చోదయితుం క్షమః ॥

ఆయన చేయు పూర్వపక్షమునకు వేఱొకరు సమాధానము జెప్పలేరు. అట్లే ఆయన సిద్ధాంతీకరించిన దానిపై గూడ వేఱొకరు పూర్వపక్షము చేయ జాలరు.

మఱియు –

శ్లో॥ తర్కేవా తన్త్రమార్గేవా కవిత్వే మధురేఽథవా।
యత్ర కుత్రాపి వా యస్య ప్రగల్భైఽపి సరస్వతీ ॥

ఇతడు మధురముగ కవిత్వము గూడ జెప్పగలడని తెలియుచున్నది. కాని అట్టి గ్రంథములేవియు మనకిపుడు లభ్యమగుటలేదు.

ఇటీవల శాసనముల ద్వారా ప్రతాపరుద్రుని యాస్థానమున నృసింహర్షి యను విద్వత్కవి యొకడుండెనని తెలియుచున్నది. అతడు రాజగురువు విశ్వేశ్వర శివాచార్యుని పుత్రుడని చెప్పబడెను. అతడు రచించిన (సిద్ధోద్వాహ) మను లఘు కావ్యమొకటి కొండపై మలచబడి లభ్యమగుచున్నది. ఇతర గ్రంథ ముల గూడ నితడు రచించినట్లు చెప్పుకొనెను.

ఆనాటిదే యనదగు నొక నిరోష్ఠ్య కావ్యఖండము, 37 శ్లోకములు మాత్రము హనుమకొండలో సిద్ధేశ్వరగుట్టపై నత్యీర్ణమై లభించుచున్నది. రచయిత పేరు తెలియదు. ఆంధ్రదేశ వర్ణనము, ఓరుగల్లు నగర వర్ణనములతో నిది నిలిపివేయబడెను. కాకతీయ శాసనములందు లభ్యమగుచున్న కావ్యలక్షణ ములుగల కొన్ని భాగము లిందు చూపబడును.

# I సంస్కృత శాసన సాహిత్యము

1. వేయి స్తంభాల గుడి శాసనము.
   శకము 1084 (క్రీ.శ. 1163)
   ఇండియన్ ఏంటిక్వరి 11—పుటలు 9 నుండి.

కాకతి రుద్రదేవుడు శకము 1084 కు సరియగు చిత్రభాను సంవత్సరమున స్వతంత్ర రాజ్యస్థాపనము నుద్దేశించి అనుమకొండలో తన పేరున రుద్రేశ్వరదేవుని, వాసుదేవుని త్రికూటాలయమునందు ప్రతిష్ఠించి ఆ దేవతల పూజా నైవేద్యములకొఱకు మద్దిచెఱువుల గ్రామమును దానముగ నొసగెనని తెలుపుటకై ఆ యాలయ ప్రాంగణములో నొక గొప్ప శాసనము స్థాపించెను. ఆ గుడిని వేయి స్తంభాల గుడియందురు గనుక నీ శాసనమును గూడ నదే పేరుతో వ్యవహరింతురు. దేవతాప్రతిష్ఠ, గ్రామదానము శాసన ముఖ్యోద్దేశ్యమై యున్నను రుద్రుడు అప్పటి కేయేవిజయములు సాధించి స్వతంత్ర రాజ్యము స్థాపించ గలిగెనో తెలుపుటకై సుమారేబది శ్లోకముల ప్రశస్తి యిందను బంధితమై యున్నది. రుద్రుని తండ్రియగు మొదటి ప్రోలరాజు విజయములు కూడ మొదట చెప్పబడెను. భరద్వాజ గోత్రుడు, రామేశ్వరదీక్షితుని పుత్రుడు, అద్వయామృత యతి శిష్యుడునైన అచింతేంద్రయతివరు డీశాసన రచయిత. జన్మనుబట్టి, విద్యనుబట్టి సద్వంశజాతుడై విద్యాసంప్రదాయములం దారితేరిన విద్వాంసుడు. ఆంధ్రదేశ చరిత్రలో కాకతిరాజ్యమువలె, ఆంధ్ర శిల్పకళలో కాకతీయ శిల్పమువలె, ఆంధ్రదేశమున వెలసిన కావ్య శిల్పమున కీయచింతేంద్ర యతి రచించిన యీ యనుమకొండ శాసనమొక మచ్చుతునుక.

వాగ్దేవిని తన జిహ్వాగ్రమందుండుగాక యని ముందు స్తుతించును.

శ్లో॥ (జా) తేవ దుగ్ధజలధేరిభి రుదంచతీవ
దుగ్ధోదధే రమృతదీధితి నిర్మితేవ ।
శ్రీఖండపిండ పరిపాండుర పుత్రలీవ
వక్త్రే వస త్వవిరతం తు సరస్వతీ నః॥

పాల తరంగములతోటి పుట్టినదివలెను, పాలసముద్రము నుండి బయలు వెడలినదివలెను, అమృత కాంతులతో జేయబడినది వలెను, చందనపు ముద్దతో

తెల్లని కాంతిగల బొమ్మవలెను సరస్వతి మా ముఖమునందెల్లప్పుడు నివసించు గాక అని తన రచన యందు కావ్య రసామృతమును సూచించెను. ప్రోలుని పత్నియు, రుద్రుని జననియు నగు ముప్పమాంబనతి రమ్యముగ వర్ణించును.

శ్లో॥ దేవీ ముప్పమ నామధేయ మహితా యస్యాగుణా స్తారకాః
కీర్తిః శారదచంద్రికేవ విలసత్కాంతేస్తు నైవోపమా।
కౌసల్యేవ చ జానకీ వచ సతీకున్తీవ పద్మేవ సా
పౌలోమీవ చ చండికేవ చ వరా తస్యాభవ ద్భామినీ ॥

ముప్పమాంబ గుణములు నక్షత్రముల వలె నసంఖ్యాకములుగ ప్రకాశించుచున్నవని గమ్యమానోపమ; కీర్తి శారద చంద్రికవలె నున్నదని పూర్ణోపమ; ఆమె కాంతితో పోల్చదగినదెద్దియులేదని లుప్తోపమ. మిగిలినవి ప్రసిద్ధములు. ముందు ఆమె గుణములను, కీర్తిని, కాంతిని వర్ణించి తదుపరి ఆమెను పురాణ ప్రసిద్ధ స్త్రీలతో బోల్చెను.

ఆ దంపతులకు రుద్రుడు జన్మించెనని తరువాత చెప్పును.

శ్లో॥ తస్యాస్తస్య సుతోఽ జనీహ పరమానందైక కందాంకురః
కామఃకిం నలకూబరః శివసుతః స్కందో జయంతోఽథవా।
జిష్ణు ర్వజ్ర ధరోఽ థవా హరిరయం దస్రౌకుమారౌ నతే
భక్తః శ్రీగిరిశే హితాయ జగతః శ్రీరుద్రదేవో నృపః ॥

ఇచట రుద్రుడు వారికి ఆనంద కందాంకురమై జన్మించెనని చెప్పుచు వానిని కాముడా, నలకూబరుడా, స్కందుడా, జయంతుడా, ఇంద్రుడా, ఉపేంద్రుడా, అశ్వినీకుమారులా అని సందేహించి వారెవరు కారు, జగద్ధితము కొఱకై శ్రీ గిరిశుని భక్తుడై రుద్రదేవ నృపుడుద్భవించెనని నిశ్చయించును. ఈ యందరితోటి పోల్చుట, శివానుగ్రహ పాత్రుడని తెలుపుట యీ నిశ్చయ పర్యవసాన సందేహాలంకారములో జెప్పబడెను. తుదకు 'నాఽరుద్రో రుద్ర మర్చయేత్' అను వాక్యానుసారముగ రుద్రనృపుడు లోకహితార్థమై శివాంశముగ నవతరించెనని నిశ్చయించెను.

రుద్రదేవుని శత్రువగు కందూరి భీమచోడుడు వాని సోదరుడైన గోకర్ణ చోడు నెట్లు చంపెనో యీ శ్లోకములో వర్ణించును. ఈ గోకర్ణుడు భీముడు చేయుచున్న దుండగములలో కలిసిరాకుండుటచేత నతనికి విషాన్నము పెట్టియో లేక యుద్ధ సంసిద్ధుడై లేనప్పుడో మాయోపాయముతో జంపెనని వేఱొక సందర్భమున జెప్పబడెను.

శ్లో॥ భీమేన భీమనకులేన కులేనహీనో
గ్రస్తో మమార గృహమూషకవత్ క్షణేన ।
మార్జార డింభకవర్ణేణ మహాంధకారే
గోకర్ణనామ భుజగో భువి శూరమానీ ॥

ఇచట భీమచోడుని నకులముతోను, గోకర్ణచోడుని భుజగముతోను బోల్చి వారిరువుర శౌర్యమును ముందు ప్రశంసించును. కాని వెంటనే భీముణ్ణి మార్జార డింభకముగను, గోకర్ణుని ఒక చిట్టెలుకగను చెప్పి, మహాంధకారములో ఆ పిల్లికూనచేత కులములో హీనమైన చిట్టెలుక పట్టుబడి క్షణములో చనిపోయెనని చెప్పను ఇందు స్తుతి, నిందల దెలుపు నకుల-భుజగోపమానములు, మార్జార డింభక-గృహమూషకోపమానములు తిలతండులములవలె సంశ్లిష్టములై ఉన్నవి. మొదటి పాదములో ఛేకానుప్రాస. భీమచోడుడు భయంకరుడైనను, మహాంధ కారములో పిల్లికూన చిట్టెలుకను మోసముతో పట్టినట్లు శూరుడైనను కులహీను డైన గోకర్ణచోడుని పట్టి చంపెనను వాక్యములో స్తుతిపూర్వక నింద కూడ సంశ్లిష్టమైయున్నది.

రుద్రునియొక్క నిరహంకార గుణము నిట్లు వర్ణించును.

శ్లో॥ రుద్రంస్తౌమి నరేశ్వరం బుధశతానేకం శ్రియోభాజనం
కృత్వాయస్య కదాపి చేతసి మదాశంకా నసంక్రామతి ।
ఏకం శ్రీపురుషోత్తమం కలకలైః కృత్వాశ్రియో భాజనం
వీచీనాంకురుతేఽధునాపి వసుధా మజ్జాగరాం సాగరః ॥

అనేక బుధుల (విద్వాంసుల) నాదరించి వారినందరిని లక్ష్మీసంపన్నుల జేసియు రుద్రుడు మనసులో నీషణ్మాత్రమైనను అహంకారము నొందడు. పురుషోత్తము

డను నొక్క బుధుని (దైవమును) లక్ష్మికి బాత్రునిగజేసి సముద్రుడు తరంగ ముల కలకల ధ్వనులతో నిప్పటికి భూమిని దద్దరిల్లజేయుచు తన ఘనతను చాటుకొనుచున్నాడు. అట్లుగాక నిగర్వియు సౌమ్యమూర్తియునగు రుద్రనరేశ్వ రుని స్తుతించుటలో గల యౌచిత్యమిందు జెప్పబడెను.

ఈ క్రింది రెండు శ్లోకములలో రుద్రుడు బ్రహ్మదేవునితోను విష్ణువుతోను బోల్చబడెను.

శ్లో॥ న్యగ్భూతీకృత రాజహంస నికరః పద్మోద్భవైకాశ్రయః
శ్రీ రుద్ర శ్చతురాననో బుధవరానందైక హేతు శ్భృశం ।
నానాశాస్త్ర విచారణైక చతురః బ్రాహ్మీవిలాసాశ్రయః
కల్పోక్త ప్రగతిః క్షితావిహ శతానన్దః స్వయం పార్థివః ॥

బ్రహ్మకుగల ముఖ్యగుణములు రుద్రరాజునకు కూడ కలవని శబ్దశ్లేషతో జెప్పను. బ్రహ్మ,శ్రీరుద్రదేవరాజులలో నొకరు ముందు రాజహంస వాహనము గలవాడు, ఒకడు శత్రురాజుల బాటదోలు వాడు; ఒకడు పద్మోద్భవుడు, మఱొకడు లక్ష్మిప్రాదుర్భావమున కాశ్రయుడు; ఒకడు నాలుగు మోములు గలవాడు, ఒకడు (మాట) నేర్పరి, ఒకడు దేవతలనానందింపజేయువాడు, ఒకడు విద్వాంసుల నాదరించువాడు; ఒకడు యుగపరిమాణముల ననుసరించి నడచువాడు, ఒకడు కల్పోక్తవిధి ననుసరించువాడు. ఇట్లు శ్లేష పదములతో నిద్దరు సమమేనని చెప్పబడెను.

శ్లో॥ సత్యాసక్తమనా నిరస్తనరక క్లేశశ్చ లక్ష్మ్యాశ్రయః
పృథ్వీభృ ద్వదనంతభోగనిలయః శశ్వద్ద్విజేంద్రప్రియః ।
దుష్టారిష్టవిమర్దనః సుమనసా మభ్యర్థితార్థప్రదో
గోత్రప్రోద్ధరణః సుదర్శనకరో రుద్రః స్వయం కేశవః ॥

ఇందు రుద్రుడు కేశవునితో సమమని చెప్పబడెను. సత్య = సత్యభామ; సత్య= సత్యసంభాషణము: నరక = నరకాసురుడు, నరకలోకము; పృథ్వీభృత్ = వరాహరూపమున భూమి నుద్ధరించినవాడు, భూమిని పాలించువాడు. అనంతుని

శరీరముపై పరుండువాడు, అనంతములైన భోగములు కలవాడు; ద్విజేంద్ర=గరుడ, బ్రాహ్మణశ్రేష్ఠులు, సుమనసులు = దేవతలు, విద్వాంసులు; గోత్ర=(గోవర్ధన) గిరి, వంశము; సుదర్శనము=చక్రము, మంచి దర్శనము; ఇత్యాది శ్లేషపదములతో కాకతిరుద్రుడు కేశవునితో సమానమని చెప్పబడెను.

రుద్రదేవుని రాజ్యపాలనమును పొగడుచు చెప్పిన శ్లోకాలు:

శ్లో॥ అస్మిన్ప్రశాసతి మహీం భువి రుద్రదేవే
రాజాభిధా శశిని నైవ నరోత్తమేషు।
ఈశత్వ మిందుతిలకే న ధనాఢ్యకేషు
తేజస్వితా దినకరే న చ శాత్రవేషు ॥

శ్లో॥ కేశగ్రహస్సురత సంగర సంభ్రమేషు
దండగ్రహో యతిషు నైవ జనోత్కరేషు।
శాస్త్రేషు వివాదకథనం వ్యవహారజంనో
న క్వాపి దుష్ట మథనం మథనం త్వరణ్యామ్॥

ఈ రెండు శ్లోకములలోను పరిసంఖ్యాలంకారము. రుద్రదేవుడు భూమిని పాలించుచుండగా 'రాజ' శబ్దము చంద్రునికే గాని వేఱొండు నరులకు లేదు. అనగా రుద్రుడు తప్ప వేఱొండు రాజులేడని యర్థము. ఈశపద వాచ్యుడు శివుడేగాని ధనవంతులకు చెల్లకుండెను. రుద్రుడు తప్ప వేఱొక ఐశ్వర్యవంతుడు లేడని తాత్పర్యము. ఇట్లే మిగిలిన యర్థములు కూడ.

రుద్రదేవుని రణరంగమును వర్ణించు ఈ శ్లోక మతిరమ్యముగ నుండును.

శ్లో॥ పాదన్యాస శిలా శ్శిరాంసి సమరే కృత్తాని ఖడ్గేన య
చ్ఛత్రూణాం పతితాని మాంస విలస త్పంకేఽథ శంకేహ్యహం।
రక్తస్రోతసి రుద్రదేవజయినో నృత్యత్కబంధాః ప్లవాః
ఆయాంత్యా విజయశ్రియశ్చ సవిధం కీర్తేః ప్రయాంత్యా దిశః॥

యుద్ధరంగమున రుద్రుడు శత్రువుల కంఠములను త్తరించగా క్రింద రక్తమాంసములతో భూమి బురదయగుట, రక్తప్రవాహము లేర్పడుట సంభవించును.

అట్టి రణభూమిపై తెగిన శిరస్సులు అచ్చటచ్చట రాళ్ళవలె నుండును. మొండెములు మాత్రము తన్నుకొనుచు కదలుచుండును. ఈ దృశ్యమును కవి అతి రమ్యముగ చమత్కరించుచున్నాడు. జయము సాధించిన రుద్రుని యొద్దకు విజయలక్ష్మి వచ్చుటకు, అట్లే రుద్రుని యొద్ద నుండి కీర్తికాంత నలుదిక్కులకు పోవుటకు ఆ మాంసపు బురదలో తెగిపడిన శిరస్సులు కాలుమోపు దాటుడు రాళ్ల (పాదన్యాస శిలల) వలెను, మొండెములు రక్త ప్రవాహములో తెప్పలవలెను నుపకరించుచున్నవట. ఉత్ప్రేక్షా—పరిణామములు.

రుద్రదేవుని గుణవర్ణనము:

శ్లో॥ దానం దైన్యపరాభవావధి రిపుచ్ఛేదావధి ర్విక్రమః
చాతుర్యం చతురాననావధి గుణగ్రామ స్త్వసంఖ్యావధిః ।
తేజో భాస్కర తాపనావధి యశోరాశిస్తు రుద్రస్య య
స్త్రైలోక్య క్రమణావధి ర్నిరవధి ర్ధర్మేమతిః శోభతే ॥

అతని దానగుణము దైన్యమునకే పరాభవము కలిగించునది; విక్రమమునకు శత్రుసంహారమే యవధి; చాతుర్యమునకు బ్రహ్మయే అవధి; గుణగణము అసంఖ్యాకము; పరాక్రమము భాస్కరావధి; యశోరాశికి ముల్లోకము లాక్రమించుటే యవధి; అట్టి గుణసంపన్నుడైన రుద్రుని మనస్సు నిరవధికముగా ధర్మమునందనురక్తమై శోభించుచున్నది. అతిశయోక్తి.

రుద్రుని యశస్సును గురించి ఆచారక్వైబంతములతో వర్ణించును.

శ్లో॥ స్స్వాయత్త్రైకరవతీందు రంబుజపతిః స్పష్టాంబుజ త్యంబరం
లోలం నీల సరోజతి స్ఫుటయశో దుగ్ధోదధౌ సంప్రతి ।
జ్యోతీంషి స్ఫుట బుద్బుదంతి హరితః కూలంతి లోకాస్త్రయ
శ్చంచ ద్వీచి చయంతి యస్య జయతి శ్రీరుద్రదేవోఽద్భుతమ్ ॥

రుద్రుని యశస్సనెడి పాలకడలిలో నిపుడు చంద్రుడొక కలువపువ్వువలె ప్రకాశించుచున్నాడు; సూర్యుడు పద్మమువలె భాసిల్లుచుండెను; ఆకాశము చలించుచున్న నల్లతామర యయ్యెను. నక్షత్రములు స్పష్టమగు బుడగలవలె నున్నవి; దిక్కు లొడ్డులగుచున్నవి; మూడు లోకములు కదలుచున్న యలలగు

చున్నవి. యశస్సును వర్ణించునపుడు కవిసమయమునందు కల్పించబడు ప్రసిద్ధ విశేషములన్నిటితోను ఇచట సంబంధము తెలుపబడెను.

రుద్రుని పరాక్రమమును దీర్ఘసమాసముతో పరుషాక్షరములతో, గౌడీ రీతిలో వర్ణించును.

శ్లో॥ శ్రీమద్రుద్ర పరాక్రమోద్భవ భయ వ్యామోహనాఖ్యోల్లస
చ్ఛస్త్ర త్రస్త సమస్త గాత్ర విలస చ్చోడోదయ క్ష్మాపతేః ।
ఉన్మత్తా ఇవ విస్మృతాఇవ మహాభూతాభిభూతా ఇవ
ప్రోద్భ్రాంతా ఇవ సంకులా ఇవ తదాప్రాణాః ప్రయాతాదివమ్ ॥

అతని పరాక్రమము వలన బుట్టిన భయమనెడి వ్యామోహనాస్త్రము వలన ఉదయచోడ నృపతి యొక్క ప్రాణములు పిచ్చెక్కినట్లు, మైమఱచినట్లు, పిశాచావిష్టితమైనట్లు భ్రాంతమైనట్లు, సంకులమైనట్లు పరిపరి విధములుగ నొకే కాలమున ననేక భావములు గలవై తుదకు దివంగతములయ్యెను. ఇచట భావసాంకర్యము భయానకమున కంగమయ్యెను.

రుద్రదేవుని యనుమకొండ శాసనములో చరిత్రాంశమును తెలుపు శ్లోకములు గూడ అర్థాలంకారములున్నను లేకున్నను చక్కని పదములతో సరళ శైలిలో రచింపబడెను. ఉదాహరణకు- ప్రోలరాజు చాళుక్య తైలపదేవుని పరాజితుని గావించి తన చక్రవర్తి పుత్రుడుగాన భక్త్యనురాగములతో విడిచి పెట్టెనని యిందు జెప్పను.

శ్లో॥ హస్త్యారోహణ కర్మ కర్మఠగతిం చాళుక్యచూడామణిం
శశ్వద్యుద్ధ నిబద్ధ గహ్వరమతిం యుద్ధే బబంధ క్షణాత్।
శ్రీమత్తైలపదేవ మంబుధ నిభ స్తంబే రమస్థం క్షణాత్
ప్రఖ్యాతో రిపుకంఠ ఖండనవిధౌ భక్త్యానురాగా జ్జహౌ॥

చాలుక్య చక్రవర్తిపై తిరుగుబాటొనర్చిన మంత్రకూట నగరాధిపతియైన గుండరాజును పట్టుకొని శిరోముండనముగావించి, వక్షస్థలముపై వరాహముద్రవేసి ఖండించెనట. అట్లే వాని సహచరుడగు ఏడరాజును పాఱదోలి మఱల యుద్ధమునకు బిలచినను రాకుండ జేసెనట. (ఇదంతయు తన రాజగు ఇమ్మడి జగదేక మల్ల చక్రవర్తి సమక్షముననే జరిపి తన ప్రతాపమును రాజభక్తిని జూపి ఆ చక్రవర్తి యనుగ్రహమునకు బాత్రుడయ్యెను.) ఈ సందర్భమున జెప్పినది

శ్లో॥ క్రుద్ధే నోద్ధురమంత్రకూటనగరీ నాథోఽథయో నిస్త్రపో
గుండః ఖండిత ఏవ ముండితశిరాః క్రోడాంక వక్షస్థలః।
ఏడో డింభకవ త్పలాయన పరో జాతో గతః స్వాం పురీ
మాహూతోపి నృపేశ్వరస్య పురతః ప్రోలేన యుద్ధాయయత్॥

[ఏడరాజును పాఱదోలుటను గూర్చి గంగాధర మంత్రి వేయించిన యనుము కొండ శాసనంలో—

శ్లో॥ విద్రావయామాస విముక్తకేశం యశ్చైక భూపాల మపాస్తశంకః।
రాజాంగణే శ్రీజగదేకమల్ల పృథ్వీపతే ర్మాన్యకవల్లభం తమ్॥
J. A. H. R. S. 86, P. 61]

కాకతిరుద్రుడు (నగునూరు రాజగు) డొమ్మరాజును జయించుట—

శ్లో॥ త్వంగత్తుంగ తురంగ పుంగవ చ యారోహ క్రమే కర్మఠం
డొమ్మంచారు పరాక్రమక్రమభరం భఙ్క్త్వాసకృల్లీలయా।
కర్ణం పార్థ ఇవామలై శ్శరశతై ర్విద్రావ్య విద్రావ్య యో
లేభే సర్వవిశేషయుక్త నగరగ్రామం సరుద్రో నృపః॥

మేదరాజును జయించి పొలవాసను కొల్లగొట్టుట-

శ్లో॥ ఈడేమేదవిడంబ డంబర భరక్షోదక్షమం క్ష్మాభృతాం
దుర్వారోద్ధుర వీరమంత్ర సమయాదానైక దీక్షాగురుం।
శ్రీమన్మైళిగిదేవసంగ సమయప్రోద్భూత దర్పాపహం
ప్రాప్తశ్రీ పొలవాసదేశ విభవం శ్రీరుద్రదేవం సదా॥

కలచురి బిజ్జలుడు కాకతిరుద్రుని తిరుగుబాటు నణచుటకై తన కొడుకగు మైళిగిదేవుని తెలంగాణమునకు బంపెను. వానికి మేదరాజాదులు తోడ్పడిరి. వారి సమయమును (కూటమును) రుద్రుడోడించి పొలవాస నగరము కొల్లగొట్టెను. ఇందు పరాక్రమ సూచకముగ మొదటి పాదములో పదాడంబరము గమనించదగును.

కందూరి భీమచోడుడు జంబుక డింభకమువలె తనవంటి మఱి కొన్ని చిన్న నక్కలతో గలిసి సింహముతో పోటిగా తానే మృగరాజునని ప్రకటించు

కాని సింహము జూలు విదిలించుచు గర్జనలు చేస్తూ రాగానే పాతిపోవునట్లే రుద్రుని జూచి పాఱిపోవును.

శ్లో॥ ఏకో జంబుకడింభకో లఘుతరై స్సంవేష్టితో జంబుకై
రాజాహంకృతి ధిక్కృత క్షితితల స్సింహాసనం స్పర్ధతే,
ఫేత్కారాకులగర్జితై ర్ముఖరయ న్సర్వాదిశో విహ్వలో
యాతః క్వాపి సటా విధూననభరైః కంఠీరవస్యా తురః॥

రుద్రదేవుడు భీమచోడునిపై యుద్ధయాత్రకు వెడలు సంరంభ వర్ణన—

శ్లో॥ యస్యోద్య ద్విజయ ప్రయాణ సమయే గంభీర భేరీ భవ
ద్భాంకారోద్భవ సంభ్రమ వ్యతికర వ్యాజృంభణోద్వేగతః।
భ్రశ్యంత్యభ్రచయా శ్చల న్త్యవనయో భ్రామ్యం త్యమీ భూధరాః
కూర్మః క్లామ్యతి ముహ్యతి ద్విరసనః కుంఠ న్తి దిక్కుంజరాః॥

ఆ గంభీర భేరీభాంకార సంభ్రమ వ్యతికర వ్యాజృంభణమునకు మిన్నులు విరిగిపడెను, భూమి దద్దరిల్లెను, కొండలు దొర్లిపడెను, ఆది కూర్మము ఆయాసపడెను, శేషుడు మూర్ఛపోయెను, దిగ్గజములు పట్టుపీడెను.

బ్రహ్మ పలువురి నుండి అనేక గుణములు తెచ్చి రుద్రుని సృష్టించెనట—

శ్లో॥ ఔదార్యం సురశాఖినః శిఖరిణః స్వర్ణాకృతే ర్గౌరవం
ధైర్యం దాశరథే ర్బలం పురభిదో గాంభీర్య మంభోనిధేః।
సౌందర్యం మకరధ్వజా త్స్వరగురో ర్విద్యారతిం కౌతుకా
దాదాయాబ్జ సముద్భవేన రచితం శ్రీరుద్రదేవో ధ్రువమ్॥

అనుమకొండ పురవర్ణన—

శ్లో॥ తస్యాస్తేనుమకొండనామ నగరీ శ్రీ రాజధానీవయా
యత్రోద్య త్సదఖండ ఖండ పరశు వ్యాజృంభణోజ్జృంభితా,
కందర్పస్య పురీవ సారతిమతీ శృంగారభావాన్వితా
మాహేంద్రీవ చ జిష్ణువిష్ణు సహితా రంభావిలాసోర్జితా॥

అలకాపురివలె శివుని విలాసములు గలది, కందర్పపురివలె రతిమతి (అనురాగాది), చేష్టలుగలది దేవేంద్రపురివలె ఇంద్రుడు (జయశీలురు) విష్ణువు, రంభ (అరటులు) గలది. శ్లేష-ఉపమానము.

శ్లో॥ యత్రస్త్రియో మకరకేతన రాజధాన్య
ఆనీల నీరజ పలాశ దృశః కృశాంగ్యః।
త్రైలోక్యసుందర దృశాం తిలకాయమానా
ఆపీన తుంగ కుచకుంభ భరాలసాంగ్యః॥

అచటి స్త్రీలు త్రైలోక్య సుందరీలకు కూడ తిలకాయమానలని అత్యుక్తి.

అచటి ద్విజుల గూర్చి -

శ్లో॥ యత్ర ద్విజేంద్ర భవనేషు నివార్యమాణాః
కీరాఃపఠన్తి పటవో వటుభి స్సమేతాః।
సర్వాంగ సంగత సమస్తవిచారచారు
చారిత్ర చర్చిత పదక్రమయుక్తవేదాన్॥

అచటి ద్విజుల భవనములలో నివారించుచున్నను నేర్పుగల చిలుకలు బ్రహ్మచారులతో గూడి సాంగోపాంగముగ పదక్రమయుక్తముగ వేదములు పఠించును.

అచటి వేశ్యలగూర్చి—

శ్లో॥ వేశ్యాగృహేషు సురతోత్సవ జాతచేష్టా
శబ్దానుకారి శుకశాబకలోరు శబ్దాః।
సర్వాదిశో ముఖరయన్తి దివావిటానాం
కన్దర్పదర్పతరలార్ణవ పూర్ణచంద్రాః॥

అచటి వేశ్యాగృహములలో శుకశాబకములు సురతోత్సవములందు బుట్టు రతికూజిత ధ్వనులను పగటియందు అనుకరించుచు అన్ని వైపుల విటులకు ఆ గృహములందట్టి వేశ్యలున్నట్లు తెలుపుచుండును. వారు కన్దర్పదర్పతర లార్ణవమున పూర్ణచంద్రుని వంటివారు.

అచటి అశ్వముల గూర్చి—

శ్లో॥ నాతిక్రామతి వైష్ణవం పదమితి ద్యాం గౌరితి క్ష్మా మిమాం
పాదైస్స్పృక్ష్యతి నో తురంగమచయః శ్రీ రుద్రదేవస్యయః।
సర్వాశాః పరిపూరయ న్విజయతే నృత్యేన సంక్షిపయం
శ్ఛత్రూన్యుద్ధ మహీతలే ప్రతిదినం విద్రావయ న్మారయన్॥

విష్ణుపదము గనుక పవిత్రమైన ఆకాశమును, గోతుల్యము గనుక భూమిని పాదములతో స్పృశించకుండ శ్రీ రుద్రదేవుని తురంగమ చయము పాదములు నిలుపక నలుదిక్కుల నృత్యముజేయుచు, యుద్ధములందు శత్రువులను పాఱదోలుచు చంపుచుండును.

శ్లో॥ అతిరమణ శరీరా యేచ నీచస్వరాఢ్యా
స్సకలతురగ శాస్త్రో ద్భాసి సల్లక్షణాఢ్యాః ।
జవభర భరితాంగా స్సత్వసంపన్నగాత్రా
అతిచిరతరజీవాః పంచధారా స్తురంగాః ॥

అచటి అశ్వములు తురగశాస్త్రోక్తముత్తైన సర్వలక్షణములు గలిగి పంచధారలని ప్రసిద్ధి జెందిన గతులు గలవి.

ఈ విధముగ అచింతేంద్రయతి కావ్యమునకుండవలసిన లక్షణములు జేర్చి యీ శాసన కావ్యము రచించెను. కవిత్వము మృదు మధుర పద భూయిష్ఠము. అచ్చటచట దీర్ఘ సమాసములు, దూరాన్వయములు ఉన్నప్పటికిని కవిత్వ మతిసరళముగ మనోరంజకముగ భాసిల్లుచుండును. సందర్భోచితముగ శ్లోకవృత్తములలోను రీతులలోను మార్పు చూపుట కూడ నిందు గమనించదగియున్నది.

## 2. గంగాధరమంత్రి శాసనాలు:

శకము (సుమారు) 1092 (క్రీ.శ. 1170)
వరం. జి. శా. పుటలు 119-126.

రుద్రుని కాలంనాటి మఱికొన్ని శాసనాలలో గూడ కావ్య లక్షణాల స్ఫురింపజేయు చక్కని రచనలు కానవచ్చును. రుద్రుని మంత్రి వెల్లకి గంగాధరుడు వేయించిన శాసనాలు అట్టివి అనుమకొండలో మూడు ఖండములు సంస్కృతములోను, ఒక తెలుగు పద్యశాసనం కరీంనగరు దగ్గర నగునూరు

లోను కలవు వాటిలోని యీ క్రింది శ్లోకము లుదాహరణముగ చూపబడుచున్నవి. వీటి రచయిత పేరు తెలుపబడ లేదు తెలుగుశాసనము ఉత్తమపురుషములో నుండుటను బట్టి యివి యన్నియు వాని స్వరచనలేయని తోచును.

శ్లో॥ నాభీ సరస్యుదభవ న్మధుకైటభారే
రంభోరుహం శతధృతి స్సమభూచ్చ తత్ర।
సామస్వనై ర్ముఖ చతుష్టయ నిర్గతైర్యః
షట్పాదిభి ర్భ్రమరవ న్నితరాం విభాతి॥

మధుకైటభారియొక్క నాభి యనెడి సరస్సులో పద్మముద్భవించెను. దాని పైన ముఖ చతుష్టయముల నుండి వెలువడు సామవేద స్వనములతో బ్రహ్మ షట్పాదములతో తుమ్మెదవలె శోభిల్లు చుండెను. ఇచట తుమ్మెద షట్పాది యగుట ప్రసిద్ధము. సామవేదము నందు ఆసురాయణీయాది ఆరు శాఖలు గాని ఆరు స్వరములుగాని యిచట బోల్చబడెను.

గంగరాజు యొక్క సత్కార్యముల బ్రశంసించుచు-

శ్లో॥ వికీర్య విత్తానిచ యాజ్ఞికేభ్యః
ప్రవర్తితై ర్యేనమఖై స్సురేషు।
తృప్తేషు సర్వేషు సురాధిపస్య
నా భూత్సుధా కోశలవవ్యయోపి॥

యాజ్ఞికులకు భూరి విశాలము లొసగి (గంగాధరుడు) చేయించిన యజ్ఞములతో దేవతలందరు సంతృప్తులు కాగా దేవేంద్రునికి తన యమృత భండారమునుండి లవ మాత్రము గూడ వ్యయము కాకుండెనట.

శ్లో॥ అసూత భీమాత్తనయం హిడింబా
ఘటోత్కచం యత్ర గిరౌ సుతార్థీ।
చకార తత్రాపి మురద్విషో యః
ప్రాసాద మాసాదిత పుణ్య పుంజః॥

హిడింబాచలముపై (గంగాధరుడు) విష్ణుదేవున కొక ప్రాసాదము నిర్మించెనను విషయమును తెలుపు ఈ ఉపేన్ద్రవజ్ర (వృత్తము) దీర్ఘసమాసాలు ప్రసిద్ధాలం

కారములేకున్నను రచనలో మాధుర్య సౌకుమార్యములను ప్రధాన గుణములు గలిగి రమణీయముగ నున్నది.

ఆ గంగాధర మంత్రి రుద్రదేవుని గుణములు వర్ణించుచు అతని భక్తి భావము నిట్లు చెప్పెను :

అగాధ హృదయే యస్య స్ఫటికాదపి నిర్మలే ।
క్షీరాంబురాశి బుద్ధ్యాస్తే శ్రియాసహ సదా హరిః ॥

ఈ అనుష్టుప్పులో నెంతయో వేదాంతార్థ మిమిడియున్నది. సముద్రము పెను గాలులకు, తీవ్రమగు శీతాతపములకు లోనగు దెప్పుడు పై భాగములోనే. అచటనే మహాతరంగము లుద్భవించి విపరీతముగ కల్లోలిత మొనర్చును. కాని అగాధమగు లోతులో అట్టి యొడుదుడుకులుండక ప్రశాంతముగ నుండును. అట్లే రుద్రదేవుని అగాధమగు హృదయము మిక్కిలి ప్రశాంతముగ స్ఫటికము వలె నిర్మలముగ నుండును. మనోవికారములెవ్వియు లేనట్టివాని హృదయములో అగాధమై కల్లోలితముగాని క్షీరసముద్రమందు వలె లక్ష్మీసమేతుడై శ్రీహరి యెల్లప్పుడు నివసించుచుండును. ప్రశాన్తచిత్తునికే కదా స్థిరభక్తి, తద్ద్వారా ఈశ్వర సన్నిధానము సిద్ధించునది. రుద్రుని హృదయమునకు క్షీరాంబురాశికి బింబ ప్రతిబింబ భావము; విష్ణువు అట్టి నిర్మల హృదయమునే క్షీరాంబరాశిగా భ్రాంతినొంది లక్ష్మీసహితుడై ప్రసన్నుడగుట చెప్పబడెను.

రుద్రుడు మేదరాజును జయించి వాని గజములతో సహ సమస్తైశ్వర్యమును అపహరించెనని యెంతో రమణీయముగ నొక శ్లోకములో వర్ణించును.

శ్లో॥ సంగ్రామరంగా ద్ధృతగంధహస్తి
మదాంబు పూరై స్సురభీకృతాశైః ।
దాసీవమేద క్షితిపాల లక్ష్మీ
ర్యస్యాంగణం సించతి నిర్వ్యలీకా ॥

యుద్ధరంగమునుండి హరించిన గంధహస్తుల యొక్క దిక్కులను బరిమళింపజేయు మదజల ప్రవాహముల వ్యాజముతో మేద క్షితిపాలుని సిరి సిగ్గువిడిచి దాసివలె

రుద్రదేవుని వాకిటిలో కలయంపి జల్లుచు ఊడిగము చేయుచున్నది వలె నున్న దట. కవి యొక్క కల్పనాశక్తి కీ రెండు శ్లోకములు చక్కని యుదాహరణ ములు.

అసంపూర్తిగ లభ్యమగుచున్న గంగాధర మంత్రి శాసనముల నుండి మఱికొన్ని శ్లోకములు చక్కని పదలాలిత్యము గలవి చెప్పదగియున్నవి.

కాకతి రుద్రుడు సూర్యుడు కొన్నిటిలో సమానమైనను రుద్రుడే సూర్యుని కంటె గొప్పవాడని—

శ్లో॥ నిత్యోదయః ప్రతిదిశప్రసరత్ప్రతాపః
శ్రీరుద్రదేవనృపతి స్సవితాచ సత్యం ।
నీచాం గతిం దినకరో భజతే కదాచి
త్కాకత్య వంశతిలకస్తు సదోచ్చవృత్తిః ॥

నిత్యోదయము, అన్ని దిక్కుల బ్రసరించు ప్రతాపము ఇరువురికీ సమానమైనను సూర్యుడు నిత్యము సాయంకాలమునను, తులారాశి యందును నీచగతిలో నుండును. కాని రుద్రదేవు డెల్లపుడు ఉచ్చవృత్తిగలవాడు. వ్యతిరేకము.

మేదరాజు ఓడిపోయి పాఱిపోవుటను వర్ణించుచు-

శ్లో॥ దహతు దహతు రుద్రో రాజధానీం మమాసౌ
ప్రలయ ముపగతాః కిం మాల్యవచ్ఛైల వృక్షాః ।
ఇతిహస తిగిరిస్థో నిర్జితో యేన మేద
క్షితిపతి రతిమాత్రం కక్ష్యవాద్యం వితన్వన్ ॥

'ఈ రుద్రుడు నా రాజధానిని కాల్చిన కాల్చుగాక. మాల్యవత్పర్వత ముపై నున్న వృక్షము లేమియు ప్రలయము నొందలేదు కదా' అని చెప్పు కొనుచు రుద్రునిచేనోటువడిన మేదరాజు కొండలకుపాఱిపోయి చంకలు వాయించు కొనుచుండెను. ఆటలో నోడిపోయిన బాలురు పాఱిపోయి కూడ చంకలెగుర వేయుచు నవ్వుచుందురు. అట్లే యీ మేదరాజు కూడ తన పురము దహింప

బడుట కంతగా చింతించక తను దాగుకొనుటకింక స్థానములు గలవు. వాటిని రుద్రుడేమియు చేయలేడని సంతోషించుచుండెనని మీలనాలంకారము. లేదా ఓడిపోయినందువలన కలిగిన దుఃఖమును సంతోషముగ జెప్పెను గనుక వ్యాజోక్తి కూడ ననవచ్చును.

క్రియా పదముల నొకే లకారములో వాడుట—అది గూడ నొక యలంకారము.

శ్లో॥ బిభేద సేతుం నగరం దదాహ
జహార హస్తిద్వితయం మదాన్ధం ।
లులావ తాళోపవనం హఠేన
యో మేదరాజం సమరే విజిత్య ॥

మఱియొక విధముగ—

శ్లో॥ అనిచ్ఛ న్కన్యకాం దాతుం యస్మై మేదనృపో దదౌ।
విభూతిం చాభిమానంచ కీర్తించ కులసంచితామ్ ॥

ఓడిపోయిన మేదరాజు రుద్రునికి తన కూతురు నిచ్చి సంధిజేసికొన నిష్టపడక తన యైశ్వర్యమును, అభిమానమును, కులసంచితమైన కీర్తిని ఇచ్చెను.

గంగాధరుడు అనుమకొండలో ప్రసన్న కేశవాలయమును, ఒక తటాకమును మఱికొన్ని దేవాలయములు నిర్మించెను. ప్రసన్నకేశవదేవునియెడ గొప్ప భక్తుడు. ఈ శాసనాంతములలో నాదేవుని స్తుతించుచు కొన్ని పంచ చామర వృత్తములు గలవు. అందొకటి—

శ్లో॥ ప్రసన్న కేశవ స్సదా ప్రయచ్ఛతు శ్రియం సవో
యదక్షి దక్షిణే రవి ర్విధుశ్చ వామలోచనం।
ఉపాసితం ముము క్షుభిస్సనందనాదియోగిభిః
ప్రసన్న కేశవం సదా ముదా నమామి సాదరమ్॥

శాసనావియందు బ్రహ్మనుండి అత్రిమహాముని జన్మించెనని చెప్పి వానినేత్రము నుండి చంద్రుడు జన్మించెనని వర్ణించెను,

శ్లో॥ నిశ్శేషవేదనివహైక నివాసభూమి
స్తదాత్మజ స్సమభవ న్మని రత్రి నామా।
ఉజ్జీవయన్మదన మీశవిలోచనాగ్ని
దగ్ధం యదీయ నయనా త్సమజాయతేందుః॥

శివుని లోచనాగ్నిచే దగ్ధమైన మన్మథుని తిరిగి బ్రతికింపజేయుచు ఆ అత్రిమహా ముని నయనమునుండి చంద్రుడు జన్మించెను.

ఆ యత్రినుండియే దేవత్రయమూర్తిగ దత్తాత్రేయుడు జన్మించెనని-

శ్లో॥ యస్య ప్రసాదా త్కృతవీర్య సూను
ర్భుజాసహస్రేణ శశాస పృథ్వీం।
పురాత్రి త్రిమూర్తిః కిల సోపి దత్తా
త్రేయాభిధో యస్య బభూవ సూనుః॥

ఆ యత్రినుండియే దుర్వాసోముని పుట్టెనని చెప్పును-

శ్లో॥ యత్కోప శాపాక్షర మాత్రకేణ
నిఃశ్రీకమాసీ త్సురరాజ రాజ్యం।
దుర్వాసస స్తస్య పురత్రయారి
మూర్తేః పితా యశ్చ జగత్ప్రసిద్ధః॥

ఆ యత్రి భార్య మహా పతివ్రతయగు అనసూయ-

శ్లో॥ పతివ్రతా శాపనిరుద్ధ చండ
భానూదయార్థం సముపాసితా చ।
విరించి నారాయణ చంద్రచూడై
ర్యస్యానసూయాకిల ధర్మపత్నీ॥

ఇట్టి పవిత్రమైన ఆత్రేయ గోత్రమునందు నవతరించిన తన వంశమును గూర్చి తరువాత జెప్పును. ఇతని కవిత్వము ద్రాక్షాపాకమున మిక్కిలి మధురముగ నుండును.

## 3. బెక్కల్లు శాసనము

శకము 1117 (క్రీ. శ. 1195)
వరం. జి. శా. పుటలు 114-117.

రుద్రదేవుని సామంతులలో రంజన వంశ క్షత్రియులు జనగామ తాలూకాలో బెక్కల్లు ప్రాంతము నేలుచుండెడివారు. వారిలో గోవర్ధనుడు, జల్లాపుడు, గదాధరుడు అను ముగ్గురు సోదరులు బెక్కల్లు సమీపమున గల గుట్టపై నున్న దేవాలయ కూటము నందొక ఆలయము నిర్మించి యందొక సంస్కృత శాసనము వ్రాయించిరి. రచయిత గౌతమగోత్రుడు, దామోదరార్యుని పుత్రుడు నాగదేవకవి యని పేర్కొనబడెను. రచన గొప్పగా అలంకార భూషితము గాకున్నను సరళమగు రీతిలో నుండును. తుదిలో ఈశ్వరుని స్తుతించుచు ప్రథమాది సప్తమీ విభక్తి పర్యంతము వసంత తిలకావృత్తములో నొక యష్టకమును గూడ ననుబంధముగ జెప్పెను. కవిత్వములో నెచటను అర్థకాఠిన్య ముండదు. అందుండి కొన్ని శ్లోకములు.

గోవర్ధనుని గూర్చి—

శ్లో॥ గంభీరోఽబ్ధివ దున్నతో గిరిరివ క్ష్మావత్ క్షమాభూషణం
శ్రీమా న్విష్ణురివ ప్రతాపనిచయో భాస్వాని వొగ్రే యమః।
సౌమ్య శ్చంద్ర ఇవామరద్రుమ ఇవ త్యాగీ గురుర్వా సుధీః
శూర స్సింహ ఇవేంద్రవజ్జి తరిపు ర్గోవర్ధనః పూర్వజః॥

ప్రసిద్ధోపమానములతో పూర్ణోపమలు.
అతని తమ్ముడు జల్లాపుడు:-

శ్లో॥ ప్రశమిత కృపణార్తి ర్వైణిభి ర్గీతకీర్తి
ర్విహితవిబుధ పూర్తిర్జ్ఞాత విశ్వేశమూర్తిః।
జనితరిపుజనార్తి ర్విశ్వవిక్రాంత కీర్తి
ర్మదన సుభగ మూర్తి శ్శోభతేఽసౌ సుకీర్తిః॥

ఆర్తి,కీర్తి,మూర్తి పదముల క్రమావృత్తి గల యమకము రమ్యముగనున్నది.
అతని మఱియొక తమ్ముడు గదాధరుడు.

శ్లో॥ విద్వద్వక్త్ర సరోజ తిగ్మకిరణో వైరిభకంఠీరవః
ప్రత్యర్థి ప్రమదాముఖాంబుజ విధు ర్మిత్రాబ్జచంద్రోదయః।
దృప్యత్క్షత్రియ కంఠకాండపరశు ర్వ్యః కామినీమన్మథః
శ్రీమా నేష గదాధరో విజయతే మంత్రే చ వాచస్పతిః॥

రూపకములు; వాచకలుప్తోపమ.
సప్తమీవిభక్త్యంతముతో జెప్పిన యీశ్వరస్తుతి-

శ్లో॥ ఆహృత్య లోచనముఖాన్యఖిలాని ఖాని
రూపాదివేద్యనికరే క్షణమాత్ర భోగ్యే।
యస్మిన్ స్మృతే జనన మృత్యు భయం వ్యపైతి
తస్మిన్ స్థిరీకురుత మానస మిందుమౌళౌ॥

## 4. కవిచక్రవర్తి శాసనాలు:

గణపతిదేవుని కాలము (క్రి.శ. 1199-1262) లోని శాసనా లనేకము ఖండ కావ్యాల వలె చక్కని ప్రశస్తి రచనలతో మనకు లభ్యమగుచున్నవి. ఆ రచయితల పేర్లన్నియు లభ్యమగుటలేదు. వారిలో ముందు జెప్పవలసినవాడు 'కవిచక్రవర్తి'. ఈ బిరుద నామము తప్ప ఆ కవీశ్వరుని నిజ నామమేదియో తెలియదు. గణపతిదేవ చక్రవర్తి యాస్థానకవి యని మాత్రము క్రింది శ్లోకమునుబట్టి నిస్సంశయముగ జెప్పవచ్చును.

శ్లో॥ ఏ తన్మాద్య న్మహీరాజ గజకేసరి విభ్రమం।
గణపత్యవనీన్ద్రస్య, శాసనం చక్రవర్తినః॥

ఇది సుప్రసిద్ధమైన పాకాల చెఱువు శాసనము లోనిది. చాల చిన్న శ్లోక మైనప్పటికి దీని యర్థ మతి గంభీరము. 'చక్రవర్తియైన గణపత్యవనీంద్రుని శాసనమిది' అనిన్నీ, 'ఆ రాజు మదించు మహీపతులనెడి గజములకు కేసరి వంటివాడు' అనిన్నీ మొదటి యర్థము. గణపతిదేవుడు అవనీంద్రుడని, చక్రవర్తి యని రెండు విశేషణములతో తెలుపబడుట పునరుక్తమగును. చిన్న అనుష్టుప్పులో పురాణ శ్లోకములందువలె అట్టి పునరుక్తిని శంకించుట కంటె శ్లోకార్థమును రెండు వాక్యములలో విడదీసి చెప్పుట యుక్తము' వించును.

మదించిన రాజుల పట్ల సింహపరాక్రమము జూపుట గణపత్యవనీంద్రుని వంతు. అట్టి గొప్ప రాజునకు ఈ ప్రశస్తి శాసనము చెప్పుట (కవి) చక్రవర్తి వంతు. శాసనం చివర దీని రచయిత 'కవి చక్రవర్తి' యని కంఠోక్తిగ జెప్పబడెను. కనుక ఈ శాసనమునకు కృతిపతి గణపతి చక్రవర్తి, కృతికర్త కవి చక్రవర్తి అను రెండర్థములు స్ఫురించున్నట్లే యనుష్టుపును జెప్పెను. 'రాయగజకేసరి' (శత్రు రాజులకు సింహము వంటివాడు) అను విశిష్ట బిరుదము గణపతి దేవునికి గలదు. కాకతిరాజులందరు ఇట్టి బిరుదులు వహించిరి. ప్రోలుదు 'అరిగజకేసరి' రుద్రదేవుడు 'దాయగజకేసరి', గణపతి, రుద్రమదేవియు 'రాయగజకేసరి' ప్రతాపరుద్రుడు 'దాయగజకేసరి' అను విశేషబిరుదములు వహించి, వాటితో నాణెములు, రాజముద్రలు నొసగిరి. కేసరి తటాకములనబడు చెఱువులు గూడ త్రవ్వించిరి.

ఈ కవి చక్రవర్తి పాకాల చెఱువు శాసనము, (వరం. జి. శా. పుటలు 208-211); చేబ్రోలు శాసనము (ఎపి.ఇం. 5, పుటలు 142...); చందవోలు శాసనము (ద.భా.శా. 6, సంఖ్య 214); గణపేశ్వర శాసనము (ఎపి. ఇం. 3, పుట 91); కొల్లాపురం తాలూక కలవకొలనులోని అసంపూర్తి శాసనము రచించినట్లు తెలియుచున్నది. కాని చేబ్రోలు, పాకాల శాసనములందు మాత్రమే కవిచక్రవర్తి రచయితగా పేర్కొనబడెను.

తన సారస్వతాభిమానము నిట్లు చెప్పుకొనును.

శ్లో॥ హంసాః పద్మాసనాసీనా యదంతస్సముపాసతే ।
పరామృతరసస్యన్ది స్రోత స్సారస్వతం స్తుమః ॥

ఈ యనుష్టుపు గణపతిదేవుని గజసాహిణి యగు జాయసేనాపతి చేబ్రోలులోను, చందవోలులోను వేయించుకొన్న శాసనములలో గలదు. ఈ రెండు శాసనములు రచించినది పాకాల చెఱువు శాసనము రచించిన కవిచక్రవర్తియే హంసలు పద్మములపై గూర్చుండి సరస్వతీనదియందు అమృతతుల్యమగు స్రోతోరసము నాస్వాదించుచుండును. పరమహంసలగు యోగులు పద్మాసనాసీనులై సమాధి యం దంతర్ముఖులై సచ్చిదానందామృతరసమును గ్రోలుచుందురు అనవద్యైక వేద్యమగు నిట్టి బ్రహ్మానందమునకు సబ్రహ్మచారియై పరామృత రసస్యన్ది యగు

సారస్వత స్రోతస్సును స్తుతించెను. కనుక నిమిత్తమాత్రముగ శాసనోద్దేశమును గ్రహించి శాసన కావ్యముల రచించుటయే తన యాశయమనుచు నీ రచనలు గావించె. ఈ కవిచక్రవర్తిచేత ఇట్టి శాసన కావ్యములు రచియింపించుకొన్న జాయసేనానియో గొప్ప విద్వాంసుడు, గ్రంథ రచయిత, కళాభిజ్ఞుడు, నాట్య శాస్త్ర లాక్షణికుడు, 'కవిసఖాశిఖామణి' యట ఇతడు రచించిన నృత్తరత్నావళి యను నొక ప్రామాణిక లక్షణ గ్రంథము మాత్ర మిపు డుపలభ్యమగుచున్నది. వాద్యరత్నావళి, గీతరత్నావళి యను మఱి రెండు లక్షణ గ్రంథములు కూడ నితడు రచించెనని తెలియుచున్నది. ఇంక రాజకీయ రంగమున కడు సమర్థుడై గణపతిదేవునికి కుడిభుజమువలె నుండెను.

అట్టి జాయనను గూర్చి కవిచక్రవర్తి చెప్పిన ప్రశంసా శ్లోకములు—

శ్లో॥ వర్తతే ఖలు వసుంధరాపతే స్తస్య సింధుతచమూధురంధరః ।
జాయన స్సకలనాట్యవైదిక గ్రామణీః కవి సఖా శిఖామణిః ॥

జాయన గణపతిదేవుని గజసైన్యమున కధిపతి, సకల నాట్యవేదమునేర్చిన ప్రౌఢ. కవిశ్రేష్ఠుడు.

శ్లో॥ మన్త్రీ కార్యనిరూపణే ప్రియసుహృ ద్విస్రంభ సంభాషణే
కావ్యారంభవిధౌ కవిః సహచర స్సంగీతసంపాదనే ।
కర్తా శిల్పకలాకలాపవిషయే సంప్రేషణే కింకరో
యుద్ధే య శ్చలమర్తిగండ నృపతే రగ్రేసరో వర్తతే ॥

గణపతిదేవునికి వ్యవహారములందు మంత్రిగను, ప్రియసల్లాపములందు సుహృదుడుగను, కవితా గోష్ఠులలో కవిగను, సంగీత గోష్ఠియందు సహచరుడుగను, శిల్పకలా కార్యములందు స్వయముగ చేయువాడును, దౌత్య వ్యవహారములలో దూతగను, రణరంగమున ముందు నడచు నాయకుడుగను జాయన సహకరించువాడు. ఇట్టి రసిక శిఖామణికి కవిచక్రవర్తి రచించిన శాసన కావ్యముల విశిష్టతను దెలుపు కొన్ని యుదాహరణములు—

రాజ వంశోత్పత్తిని గూర్చి చెప్పిన శ్లోకము.

శ్లో॥ మను రంశమతోఽస్య సూనురాసీద్యత ఏవాద్యుదితాః స్వభావశుద్ధాః
నిగమాదివ సత్యధర్మధారాః తుహినాద్రేరివ రాజహంసవంశాః॥

వివస్వంతుని నుండి మనువు పుట్టెను. ఏ మనువునుండి స్వభావశుద్ధములైన అనగా జన్మనుండియే పరిశుద్ధములైన సమస్త ధర్మధర్మములు, రాజవంశములు ఉత్పన్నములైనవో అని అన్విత విశేషణ వాక్యము. మనువునుండియే అపౌరుషేయము లగు వేదములనుండి స్వభావశుద్ధములగు ధర్మములవలె మను ధర్మములు, తుహినాద్రినుండి స్వభావశుద్ధములగు రాజహంసలవలె రాజవంశములు ఉత్పన్నమైనవి. ప్రజారంజనాది సద్గుణవిశిష్ట రాజవంశ్యులందరు వేదములవలెను, తుహినాద్రి వలెను స్వభావశుద్ధమైన మనువునుండియే పుట్టిరిగనుక కాకతీయ వంశము గూడ నట్టి పరంపరగా సద్రాజవంశముగ నుత్పన్నమయ్యె నని తాత్పర్యము.

జాయ సేనానిచేత నోటమి పొందిన శత్రురాజుల విలాసమందిరములు పరాఙ్ముఖులు కాగా ఆ భవనములు పాడుపడి యున్నవని చెప్పును.

శ్లో॥ ఏతైః పురా నః క్షితిపాల పుత్రాః
సంరక్షితా స్స్వయతి దంతదష్టైః॥
ఇతీవ యద్వైరి విలాసహర్మ్యైః
స్తృణ ప్రరోహా శ్శిరసా ధ్రియన్తే"

వాడుకలో లేని భవనములెంత మంచివైనను కొద్ది కాలములో పాడుపడి వాని పైన గడ్డి మొలచుచుండును. జాయ సేనాపతిచేత యుద్ధములో ఓడిపోయిన రాజులు భోగములందాసక్తి లేని వారైరి. వారి విలాస హర్మ్యములు పాడుపడెను. పూర్వకాలపు యుద్ధములందు ఓటమిని గడ్డి గొరకుట ద్వారా సూచించెడి వారట. అట్లు చేయుట శరణు వేడుకొనుటను సూచించును. ఓడించిన రాజు అట్టివారిని చంపక వారి నిరసనను క్షమించుచు వదలెను. పూర్వము యుద్ధములో మన రాజకుమారులు ఈ గడ్డి కొరికి రక్షింపబడిరి. కనుక, వారి కృతజ్ఞతా సూచకముగా వారి విలాస హర్మ్యములు ప్రాకారాంకురములను తమ శిరస్సులపై ధరించి గౌరవించుచున్నవి. హేతువత్ప్రేక్ష.

జాయనచేత పరాజితులైన శత్రురాజులు తమ పట్టణములు వీడి గిరుల నధిగమించి పారిపోవుట యిందు వర్ణింపబడెను.

శ్లో॥ సుతను వదనకాంతిం వాససః పల్లవేన
స్థగయ సలిలపూరైర్ దుర్గమం వర్త్మమాభూత్।
ఇతిగిరి మధిగచ్ఛన్ యస్యశత్రు క్షితీశః
కథయతి నిజకాంతాం చంద్రకాంత స్థలీషు॥

కొండలపై పోవునపుడు వారికి త్రోవలో చంద్రకాంత శిలలు తగులుచుండగా ఆ రాజు తన ప్రియురాలితో ముఖమును గుడ్డతో కప్పుకొనమని చెప్పునట. చంద్రబింబమును పోలియుండు ఆమె ముఖకాంతి సోకగనే ఆ చంద్రకాంత ద్రవించి బురదయై తమ త్వరిత గమనమునకు ప్రతిబంధక మేర్పడును గనుక చీరెతో ముఖమును కప్పుకొనవలయునని రాజు చెప్పును. అట్లు ముఖము కప్పుకొని సంచరించుట అభిమానవంతులకు పరాజయసూచకము కూడ. కొంగుతో కన్నీరు తుడుచుకొనుమని కూడ వ్యంగ్యార్థము.

ఇట్టి భావమునే యీ కవిచక్రవర్తి పాకాల శాసనములో గూడ గణపతి దేవుని శత్రువును గూర్చి చెప్పును. (వరం. జి శా. పుటలు 203-210).

శ్లో॥ హస్తై రాచ్ఛాదితాననం మృగదృశో నోచేన్మృగాంక భ్రమా
న్నందన్ కృంతతి పోతపాత్ర ముదధి స్తుంగై స్తరంగోత్కరైః।
ఇత్థం యత్ప్రతి భూభృతాం ప్రతిదిశం ద్వీపాంతరం గచ్ఛతాం
శుద్ధాంత ప్రమదాః సభీతి సదయం శంసంతి సాంయాత్రికాః॥

ఇచట గణపతిదేవుని చేతిలో పరాజితులైన శత్రురాజులు సపత్నీకులుగ ద్వీపాంతరాలకు నౌకా వ్యాపారుల పడవల్లో రహస్యంగా పారిపోతుంటే ఆ వ్యాపారులు చెప్పే మాటలివి. ఆ శత్రురాజు ప్రియురాండ్రతో తమ ముఖములను చేతులతో కప్పుకొనుడని చెప్పుదురు. కాకపోతే ఆ ముఖములను చంద్రబింబ ములుగా భ్రమించి సముద్రముప్పొంగి పెద్ద కెరటములతో తమ యోడను పగుల గొట్టగలదు. ఈ భయముతోను; వారియందు దయతోను ముఖముల నాచ్ఛాదించుకొనుడని చెప్పుదురు. కన్నీరు తుడుచుకొనుడని వారి నోదార్చుట కూడ నిచట వ్యంగ్యార్థము. భ్రాంతిమూలక అతిశయోక్తి.

ఇట్లాగే గణపతిదేవుని దర్శనానికై వచ్చిన సామన్త రాజుల కోలాహలమును చేబ్రోలు శాసనంలోను పాకాల శాసనంలోను కవి చక్రవర్తి యింపు మీంచుగ నొకే విధంగా వర్ణించును.

శ్లో॥ మాత్వం మర్దయ మద్రనాథ పురతః పాంచాల ముంచాంతరం
మార్గం దేహి విదేహభూప పదవీ హమ్మీర కింవార్య తే।
హూణ క్షీణగతిం జహీహి గమనే కాశీంద్ర కా సాంద్రతా
యస్యద్వారి విజృంభతే చిరమితి క్ష్మాపాల కోలాహలః॥

ఇందులో చరిత్రాంశాన్ని పరిగణించకూడదు. గణపతిదేవుడు మద్ర, పాంచాల, విదేహాది దేశాధిపతులను జయించి వారిని తనకు సామంతులుగ జేసుకొనలేదు కాని కవి వర్ణనమటుకు అద్భుతంగా నడుస్తుది. 'త్రొక్కిన రాదకయ్యా మద్ర నాథ! ముందు త్రోవ వదలవయ్యా పాంచాలరాజ! అడ్డం ఏస్తావేమయ్యా హమ్మీరుడా! నెమ్మదిగా పెళ్ళినడక నడుస్తావేమయ్యా హూణరాజ! ఈ జాగు ఏమిటయ్యా కాశీంద్ర!' అనుకొంటూ సామంతులంతా అహమహమికతో ముందుకు పోయి రాజుగారి దర్శనం చేసికొనవలెనని ఆతురతను వ్యక్తం చేస్తున్నట్లు కవి వర్ణించెను.

పాకాల శాసనంలో మరొకవిధంగా వివిధ రాజులు బేర్కొనబడుదురు.

శ్లో॥ కాశీనాథః కలింగః శకధరణిపతి ర్మాలవః కేరలేశః
తౌమ్మాణో హూణభూపః కురుపతి రరిమర్దాధిపో మాగధేశః।
నేపాళ శ్చోళవృద్ధీపతిరితి వినతా నగ్రతో రాజవర్గాన్
నామగ్రాహం గృహీత్వా సదసి సదసి యద్దర్శకా దర్శయన్తి॥

వినతులైన ఆయా దేశాధిపతులకు గణపతిదేవుని రాజసభలో వారి వారి స్థానములు జూపుచుందురని వర్ణన. కేవలం అతిశయోక్తులు.

ఇదే విధంగా విద్యానాథుడు ప్రతాపరుద్రీయ నాటక ప్రకరణంలో ప్రతాపరుద్రుని పట్టాభిషేకానంతరం ఉపాయనము లిచ్చుటకై వేచియున్న సామంతుల నుద్దేశించి ప్రతీహారి మాటలుగ చెప్పిన శ్లోకం.

శ్లో॥ కాళింగాత్ర నిషీద కొంకణపతే దూరే భవాంగేశ్వర
ప్రాంతం సంశ్రయ మాళవేంద్ర శనకై స్సోపాయనం ప్రాపయ।
పాణ్డ్యాగ్రేభవ సేవణక్షితిపతే పశ్చాద్భవాద్యైవ వః
స్వామీ కాకతి వీరరుద్ర నృపతిః సర్వాన్ క్రమాదీక్షతే॥

## 5. పాలంపేట శాసనము

శకము 1135 (క్రీ.శ. 1213)
వరం. జి.శా. పుటలు 142-149.

గణపతిదేవుని సేనాధిపతులలో రేచర్ల రుద్రుడు అతిముఖ్యుడు. మహా దేవరాజు యుద్ధములో మరణించగా గణపతిదేవుని రాజ్యసింహాసనముపై నిలుపుటకై ఇతడు మిక్కిలి పాటుబడినట్లు చెప్పుకొనెను. పాలంపేటలో రామప్ప దేవాలయము నితడు నిర్మించెను. అచట సుదీర్ఘమగు నొక శిలా శాసనము గూడ వేయించెను. ఈ శాసన రచయిత యెవరో చెప్పబడలేదు కాని అది యొక చిన్న కావ్యమువలె కాకతీయ వంశమును గూర్చియు రేచర్లరెడ్డి వంశము వారిని గూర్చియు చెప్పును. చరిత్ర దృష్టిలో గూడ ఈ శాసనము ముఖ్యమైనది. గణపతిదేవుని భక్తి భావమును చెప్పుచు—

శ్లో॥ శ్రీమద్గణపతి క్షోణీపతి ర్జయతి జిత్వరః।
యచ్చిత్తే పి వసన్నీశో నముంచ త్యచల స్థితిమ్॥

జయశాలి యగు గణపతిరాజు చిత్తములో నున్నప్పటికి శివుడు (కైలాస) అచలముపై నుండు భావమును విడుచుట లేదు. అనగా గణపతిదేవుని హృదయము కైలాసమువలె నతి నిర్మలముగను నతి స్థిరముగను నుండుటచేత, (చిత్తైకాగ్రత గలవాడు గనుక) ఈశ్వరుడెప్పుడు వాని చిత్తమునందు కైలాసాచలముపైవలె చలించనివాడై యుండును. రుద్రదేవుని గూర్చి కూడ నిట్టి వర్ణన మొకటి గంగాధరమంత్రి శాసనము నుండి వెనుక చూపబడెను. అచంచల మగు భక్తి భావమిందు గోచరించును. రేచర్ల బ్రహ్మసేనాని పూర్వము కాకతి బేతరాజుతో కంచిపై దాడి వెడలెను. ఆ సందర్భమున వాని పరాక్రమమును వర్ణించును.

శ్లో॥ తూర్య ప్రణాద సమనంతర మేవ తూర్ణ
మాక్షిప్య యోయవనికా సదృశం కవాటం।
కాంచీపురస్య సమపాదయదాశు వీర
లక్ష్మీ వివాహ మిహ కాకతివల్లభస్య॥

యుద్ధభేరి మ్రోగిన వెంటనే కాంచీపుర దార్వమును యవనికా సదృశముగ తొలగించి వీరలక్ష్మికి కాకతి వల్లభునితో వివాహము నేర్పరచెను. కాంచీపుర కవాటము. భేదించి దాని నాక్రమించుకొనుట యిందు వర్ణించబడెను. రేచర్ల రుద్రుని గుణవిశేషములు వర్ణించుచూ.

శ్లో॥ మేరౌ స్థైర్య మమార్దవే మనసిజే సౌందర్య మీశద్రుహే
గాంభీర్యం విషజన్మవేశ్మని సరిన్నాథే సురక్ష్మారుహే।
దానం దీన దురాసదే కమలభూః సృష్ట్వాతదప్రీతితో
దోషా స్పృష్ట గుణాకరం యమసృజ త్కామాంబికా నందనమ్॥

బ్రహ్మదేవుడు మొదట అతి కఠినమైన మేరువునందు స్థైర్యగుణమును, ఈశద్రోహియైన మనసిజునియందు సౌందర్యమును, (కాలకూట) విషజన్మస్థానమైన సముద్రునియందు గాంభీర్యమును, దీనులకు పొందశక్యముకాని కల్పతరువునందు దానమును సృష్టించి సంతృప్తిచెందనివాడై దోషము లెవ్వియులేని గుణనిలయునిగ నీతని సృష్టించెను.

అతని ప్రతాపమును గూర్చి—

శ్లో॥ వీరారాతి నృపాంధకారతరణే ర్యస్య ప్రతాపాతపః
ప్రత్యర్థి ప్రమదా లసన్ముఖసరోజాతవ్రజ మ్లానతాం।
ఆశ్చర్యం కురుతేతరాం ప్రియతమప్రాప్తిప్రమోదాన్విత
స్వాంత స్వర్వనితాక్షి కైరవ వన ప్రోత్ఫుల్లతాంచ స్ఫుటం॥

వీరారాతి నృపవర్గ మనెడి అంధకారమునకు సూర్యునివంటి ఆరుద్ర సేనాని యొక్క ప్రతాపమనెడి యెండ ఆ శత్రుస్త్రీల ప్రకాశించు ముఖసరోజ వ్రాతము వాడిపోవునట్లొనరించుచున్నది. అంతకంటె నాశ్చర్యమేమన, తమకిష్టతమము లగు ప్రియులు ప్రాప్తించినందుకు సంతసించు స్వర్లోక వనితల నేత్రముల నెడి

తెల్ల కలువల వనమును స్ఫుటముగ వికసింపజేయు చున్నది. లోకమునందు ఆతపమునకు సరోజములు వికసించుట, కైరవములు ముకుళించుకొనుట సహజము. అందుకు విరుద్ధముగ రుద్రుని ప్రతాపాతపమునకు సరోజములు వాడిపోవుట, కైరవములు వికసించుట అసహజము గనుక విరోధము.

అతనిచే విడువబడిన బాణముల గూర్చి—

శ్లో॥ యస్యావక్ర పరాక్రమ ప్రణయిన స్సౌపర్ణ పుంఖాశ్శరాః
తీక్ష్ణాగ్రా స్సమరే రిపుక్షితిపతివ్రాతం విభిద్య క్షణాత్।
భూమిం సంప్రవిశ న్తి దుష్టదమనా దస్మాభి రద్యోద్ధృతః
పృథ్వీభార ఇతి ధ్రువం కథయితుం వోఢు ర్భువం భోగినః॥

పరాక్రమశాలియగు రుద్రుని యొక్క బాణములు సుపర్ణాంకిత పుంఖములు (పిడులు) గలవి. కాకతీయులు వరాహముతో బాటు తమ వంశ చిహ్నముగ గరుడాంకమును గూడ నుపయోగించుకొనువారు. కనుక వారి సేనాని యగు రుద్రుడు గరుడాంకముగల బాణములను శత్రువులపై వేయగా అవి శత్రు సంహారమొనర్చి భూమిలో జొచ్చుకొని పోవుటను కవి యుత్ప్రేక్షించెను. తమ చేత దుష్ట సంహారము చేయబడి భూభారము తొలగించబడెను (నీవు విశ్రాంతి దీసికొనవచ్చును) అని భూమిని మోయుచున్న శేషునితో జెప్పుటకై వెళ్ళు చున్నవా అన్నట్లుండెను. బాణములు గరుడచిహ్నాంచితములు గాన శేషునితో స్వేచ్ఛగాను పరిహాసముగాను చెప్పగలిగెనని భావము.

మఱియొక వర్ణన—

శ్లో॥ యద్దోర్దండో ద్ధృతాసి ప్రహతి వినిహతారాతి వీరక్షితీశ
స్వర్లోకస్త్రీవివాహప్రతతయవనికాసన్నిభ స్సంవిభాతి।
యుద్ధే సన్నద్ధ వాజీ వ్రజఖురవిదళద్భూసముత్థః పరాగః
ఖే వి స్తీర్ణః కరీంద్ర ప్రచురమద జలై శ్ఛిన్నమూల స్సమంతాత్॥

యుద్ధ రంగమునందు గుఱ్ఱముల గిట్టలచే నెగురగొట్టబడిన దుమ్ము ఆకాశమందు వ్యాపించినదై క్రింద మదపుటేనుగుల మదజలముతో తడిసి అణగిపోగా నాకసములో వ్రేలాడు పైభాగము మాత్రము మిగిలి ఆ రుద్రుని చేతిలోని కత్తితో

ఖండింపబడిన శత్రురాజులు స్వర్లోకస్త్రీలతో వివాహమునకై దాచబడిన తెఱవలె నున్నదా యన్నట్లుండెను. యుద్ధమునందు లేచిన దుమ్మును హతవీరులకు స్వర్లోకస్త్రీలతో వివాహము కొఱకు దాచిన యవనికగా సంభావన చేసెను.

ఈ రుద్రుడు ఓరుగల్లు పురములో గూడ రుద్రేశ్వర దేవుని బ్రతిష్ఠించి ఆ దేవుని అంగరంగ భోగార్థమై నెక్కొండయను గ్రామము నిర్మించి దాన మొసగెను. ఆ పురము యొక్క వర్ణన చేయుచు గజములను, అశ్వములను, వీరులను జెప్పి తరువాత అచటి సంగీత, సాహిత్య, విద్యాభిరుచిని వర్ణించును.

శ్లో॥ క్వచి ద్వీణా వేణు ధ్వనియుత వధూగాన నినదః
క్వచిన్నవ్య శ్రవ్య ప్రమదిమ యుత పద్యప్రపఠనం।
క్వచి ద్విప్రవ్రాతస్ఫుటకృత చతుర్వేద గుణనం
క్వచి చ్ఛాస్త్రాభ్యాసవ్యసని సదుపన్యాస విభవః॥

ఇట్టి పురవైభవమును చూచుటకై —

శ్లో॥ యస్యాః శ్రియ మివ ద్రష్టుం తాంబూలలతికా ద్రుతం।
ఉద్యానపూగస్కంధాగ్రాణ్యారోహన్తి సమంతతః॥

ఆ నగర వైభవమును జూడ వేడుకతోవలె తాంబూలలతికలు త్వరత్వరగా ఉద్యాన వనములందుండు పూగవృక్షాగ్రముల నధిరోహించుచున్నవట. తమల పాకునకు పోకకు సహజ సంబంధము. ఆ నగరోద్యానములందాలతికలు, చెట్లు నాయికా నాయకులకు బోల్చబడుట గమ్యమానము. నగర వర్ణనలో నితర విష యములు వాచ్యముగ జెప్పి యీ యంశమును వ్యంగ్యముగ నిచట సూచించెను.

## 6. కొండపర్తి శాసనాలు

శకము 1125 (క్రీ.శ. 1203);
1162 (క్రీ.శ. 1241).

గణపతి దేవుని సేనాపతులలో మల్యాల చౌండసేనానికూడ నొక ప్రముఖుడు. వరంగల్లు సమీపములోనున్న కొండపర్తి ఇతని నెలవు. రాజధానీ నగరమునకు సమీపములో దాని రక్షణకై ఏర్పాటు చేయబడిన సేనాశిబిరమున

కితడు నాయకుడు. విరియాల వంశమునకు చెందిన మైలమ ఇతనిభార్య. ఈ దంపతులు ధర్మపరులై యచట చౌండేశ్వరాలయము నిర్మించి యందొక సంస్కృత శాసనము వేయించిరి. ఈ మల్యాల వంశానికి చెంది వీరికి సన్నిహితులైన కాటచమూపతి, అతని భార్య కావాంబిక వేరొక త్రికూటాలయమును నిర్మించి యందొక శాసనము వ్రాయించిరి. ఈ రెండు శాసనములయందు రచయితల పేర్లు చెప్పబడలేదు. రెండును చక్కని కావ్యశైలిలో రచింపబడినవి. వీటిలోని కొన్ని వర్ణనలు రమ్యముగ నుండును.

(వరం.జి.శా. పుటలు 181-188; 192-199)

శ్లో॥ మల్యాలనాథవిమలాన్వయ సంభవస్య
యస్యాగ్రయో గతభియో నిమిషం పురస్థాః ।
చిత్రం భవన్తి సమరేఽధిక లాభభాజో
యత్పంచతాం త్రిదశతా మపి యాన్తి భూయః ॥

ఏ చౌండసేనాపతి యెదుట యుద్ధములో నిమిషమాత్రము ధైర్యముగ నిలబడిన శత్రువీరులు పంచత్వమును (మృతిని), త్రిదశత్వమును (దేవత్వమును)(అయిదు రెట్లగుట, మూడు దశలు గలవారగుట) అను నధికలాభము పొందువారగుచున్నారో—అని స్తుతి పూర్వక నిందారూపవ్యాజోక్తి. ఈ చౌండసేనాపతి భార్య మైలమ సర్వగుణోపేతయై ప్రసిద్ధ స్త్రీలకంటెను ఉత్కృష్ట గుణశాలియై యుండెనని వర్ణించును.

శ్లో. గంగావక్రగతి ర్వ్యమార్గగమనా సారుంధతీ సర్వదా
భూరేషా చ భుజంగభోగనిరతా సీతా కుజన్మా తథా।
పాంచాలీ బహువల్లభా ప్రవిదితా జాతా జడా దిందిరా
నిర్దోషా గుణినీ చ యస్య గృహిణీ తా నూపమేయా కయా॥

పవిత్రతలో ప్రసిద్ధమైన గంగ వంకర నడక గలది. పాతివ్రత్యములో ముందు చెప్పతగిన అరుంధతి మార్గమేదియు లేని ఆకాశములో చరించును. ఓర్పులో చెప్పదగిన భూమి శేషుని పడగపైనున్నది (విటునితో భోగ మనుభవించునదని వేరొక అర్థము). మరొక మహా పతివ్రత సీత భూమిలో బుట్టెను (మంచి జన్మ

గలది కాదు) అట్లే ద్రౌపది యనేక భర్తలు గలది, సాక్షాత్తు లక్ష్మీదేవికూడా జడమైన సముద్రములో జన్మించెను. ఎట్టి దోషములేక సమస్తగుణోపేతయైన మైలమ వారిలో నెవరితో బోల్చ వీలగును?

ఈ మైలమ కటుకూరు శాసనంలో కూడ వర్ణించబడును.

శ్లో॥ మందసుందరగతం సుభాషితం
లోచనాంచల విలోల వీక్షితం ।
హంస కోకిల మృగైః పృథక్కృతం
యత్రయోగ మగమ త్పరస్పరం ॥ (తెలం. శా. II. పుట 129)

మందసుందరగమనము హంసలలోను, మంచి కంఠధ్వని కోకిలలోను, లోచనాంత విలోల దృష్టి ఆడులేళ్ళలోను కనుపించును. స్త్రీల విషయమై యెన్నదగిన యీ మూడు సద్గుణములు విడిగా మూడు చోట్ల నున్న వాటినొకే పర్యాయము చూచుట కష్టము. అట్టి మూడు గుణములు ఇపుడొకే చోటున (ఆ మైలమ యందు) కూడి యుండి శోభాతిశయము గూర్చున్నవి.

కాచాంబికను వర్ణించుచు వేఱొక కొండపర్తి శాసనములో—

శ్లో॥ కాచాంబికా రాజతి తస్యపత్నీ
పతివ్రతా శీల గుణాభిరామా ।
తత్పాద ముద్రోద్వహనాది వోర్వీ
జాతా స్వయం సంప్రతి రత్నగర్భా ॥

పతివ్రతాగుణాభిరామ యగు కాచాంబిక యొక్క పాద ముద్రలు తనపైనుండుట బట్టి యిప్పుడు భూమి రత్నగర్భ యయ్యెనట - ఆమె పాద తాడనము భూమికి దోహదమయ్యెనని భావము. ('సనూపుర రవేణ స్త్రీచరణేనాభి తాడనం' అని స్త్రీ చరణ తాడనము దోహదకారిగ చెప్పబడెను.) ఆ మైలాంబ యొక్క పాతివ్రత్య మహిమ భూమి రత్నగర్భయగుటకు కారణమయ్యెనని కావ్యలింగాలంకారము.

ఆమెనే మఱొక విధముగ వర్ణించును.

శ్లో॥ అంగుష్ఠ నిష్ఠ్యూత మరీచిజాలై
ర్యత్పాద పీఠ ప్రతిపత్తిభాజాం ।
సీమంత రేఖాసు విలాసినీనాం
సిందూరలీలారచనాం కరోతి ॥

ఆమె యంగుష్ఠకాంతులు ఆమె పాదపీఠమును సేవించు స్త్రీల సీమంతములందు సిందూర రచనను గావించుచున్నట్లున్నది.

ఇట్టి వర్ణనల విషయములో వ్యక్తులు ప్రధానము గాదు. కవులు తమ కల్పనా శక్తితో నెట్టి యుత్తమనాయకునైనను నిదే విధముగ వర్ణింతురు. కవి యొక్క ప్రతిభావిశేషమునకే ప్రాధాన్యము. ఒక్కొక వర్ణనలో స్వభావోక్తులు కూడ రమణీయముగ నుండును. కాటసేనాని నిర్మించిన దేవాలయమును వర్ణించుచు-

శ్లో॥ ప్రాకారో జయతి త్రికూట మభితస్తేన నిర్మాపితః
సుశ్లిష్టైః క్రమశీర్షకై రుపచితో నీలోపలైః కల్పితః।
యశ్చాఽలక్షిత సంధి బంధకథనా దేకాశిలా తక్షకైః
సంతక్ష్యేవ మహీయసీమివ శిలాం యత్నా త్సముత్తారితః ॥

కాకతీయ వాస్తు విశేషమును ప్రకటించు శ్లోకమిది. నల్లరాళ్ళను నున్నగ జేసి స్తంభములను, దూలములను నిర్మించుటయేగాక ప్రాకారమును గూడ నట్లే నునుపుజేసిన యంచులుగల శిలలతో సంధిబంధములు కూడ కనుపించకుండునట్లు గోడలను నిర్మించి ఆలయములను రూపొందించుట ఆనాటి శిల్పుల విశిష్టత యని మనము వాటి శిథిలముల గొన్నిటినిబట్టి తెలిసికొనుచుంటిమి. శిలల మధ్య అతుకులు గనుపించకుండ, నొకే బృహచ్ఛిలను దేవాలయముగను ప్రాకారముగను రూపొందించినట్లు, ఆనాటి తక్షకులు నిర్మించుట వారి గొప్పతనము. అట్టి విజస్థితి నిట్లు వర్ణించి చెప్పుట కవియొక్క గొప్పతనము.

ఆ కొండపర్తి శాసనములలో నొకదానిలో శివస్తుతి-

శ్లో॥ అభీష్ట ఫలదః స్థాణు రష్టమూర్తి రతీంద్రియః ।
కామారి రర్ధనారీశో మహాదేవ స్సపాతు వః ॥

స్థాణువైనను (ఎండినమోడైనను) కోరిన ఫలము లొసగును, ఎనిమిది మూర్తులు గలవాడైనను నింద్రియములకు గోచరించువాడు కాడు, కామారియైనను సగము శరీరముతో నారిని గలిగి (ఆలింగనము జేసికొని) యున్నవాడు, అట్టి శివుడు మిమ్ము రక్షించుగాత - ఇందు 'అపి' తో కలిపి 'స్థాణురపి' ఇత్యాది ప్రయోగములు చేయకయే విరోధోక్తి.

## 7. వర్ధమానపుర శాసనము:

శకము 1167 (క్రీ.శ. 1245); తెలం. శా. ii - పుట 107.)

గణపతిదేవుని సైన్యాధిపతులలో మాల్యాల గుండయ యొకడు. ఇతడు కందూరు మండలములో వర్ధమానపురము (వడ్డమాను) ప్రధాన నగరముగా ఆ ప్రాంతమునకు సామంతాధిపతియై యుండెను. గోన వంశములో జన్మించిన కుప్పాంబిక యితని భార్య. వీరు వర్ధమానపురములోను, బూదపురములోను ఆలయములు నిర్మించి అందు శాసనములు వేయించిరి.

ఆత్రేయ గోత్రుడు ఈశ్వరార్యుని పుత్రుడు అగు మయూరసూరి యీశాసనములు రచించెను. ఇతడు పదవాక్య ప్రమాణప్రమేయ విచిత్రకవిత్వ తత్త్వజ్ఞుండని అందు చెప్పబడెను. అభినవ మయూరసూరి యని యితడు పేర్కొనబడుటనుబట్టి యిది ప్రసిద్ధ మయూర కవి ననుకరించుచు ధరించిన బిరుదు నామమై యుండును. పూర్వముకూడ రాజాస్థానములలో ప్రసిద్ధ విద్వాంసులను, కవులను బిరుద ప్రదానములతోను, కానుకలతోను సన్మానించుట ఆచారము. ఇతని రచన అర్థగాంభీర్యపదలాలిత్యములలో రమ్యముగా నుండును. అందు గణపతిదేవుని పొగడుచు—

శ్లో॥ సముద్ధరతి నిర్వైరం తస్మిన్విశ్వంభరామిమాం,
సహస్రేణ ముఖై శ్శేషో యుగపత్స్తౌతి యద్గుణాన్॥

ఆ గణపతిదేవుడీ భూమిని నిర్వైరముగ బాలించుచుండగా (భారముడిగి భూమి తేలికయై కాబోలు) శేషుడు తన వేయి శిరస్సులతోటి ఆ రాజు గుణముల గీర్తించుచుండెను.

గుండ సేనాపతిని వర్ణించుచు—

శ్లో॥ ఆకారతో రతిపతిః స్వయమేవ యోఽసౌ
వీరః ప్రచండచరితః పరమేష భేదః।
అస్త్రీకరోతి మదన స్సమరాంగణేస్త్రీ
ర్వీరానయంతు కురుతేఽ స్త్రధరానపిస్త్రీః ॥

ఇతడు (గుండయ) ఆకారములో స్వయముగ రతిపతిని బోలియుండును. వీరుడు ప్రచండుడు కూడ. కాని యీ భేదము కలదు. మదనుడు సమరాంగణ ములో స్త్రీలను అస్త్రముగ జేసికొనును. కాని గుండయ అస్త్రధరులైన వీరులను కూడ సమరాంగణమున స్త్రీలుగ జేయును. ఉపమానముకంటె నుపమేయ మధి కముగ జెప్పును గనుక వ్యతిరేకము.

గుండ సేనాపతి నిర్మించిన నాగేశ్వరాలయము యొక్క యౌన్నత్య మును గూర్చి—

శ్లో॥ ఆదౌ యస్య నికామహేమశిఖరం జ్ఞాత్వా సమాలోచ్య త
త్కోణైర్భానురథావరోధన భయా న్మార్గద్వయంవేధసా।
నిర్మాయోత్తర దక్షిణాయన నిభా దిత్థం జగత్కల్పితం
నోచేత్క్షుణ్ణరథో రవిః కథమిహ స్పష్టం సమాచేష్టతే॥

ఈ దేవాలయముపై నుండు హేమశిఖరమును ముందుగనే తెలిసికొని ఆ శిఖర కోణములతో సూర్యుని రథమున కవరోధము కాగలదను భయముతో బ్రహ్మ యీ జగత్తు నుత్తరదక్షిణాయన భేదముతో కల్పించెను. లేకున్నయెడల క్షుణ్ణ మైన రథమార్గములలో సూర్యుడెట్లు నడచును?

శ్లో॥ యస్య ప్రశస్య శిఖరార్పిత హేమకుంభ
నిష్క్రాంత దీధితి తతిః పురసుందరీణాం।
శ్యామాసు జారగమనం వినివారయంతీ
విద్యోతతే దినమణే రపరా ప్రభేవ॥

ఈ దేవాలయముపై నున్న శిఖరముపై నమర్చబడిన హేమకలశము యొక్క కాంతి రాత్రులందు పురసుందరీలు జారుల యొద్దకు పోవుటను నిరోధించుట కేర్పడిన సూర్యునియొక్క శ్వేతొండు కాంతివలె ప్రకాశించుచున్నది. కర్మసాక్షి గనుక సూర్యుడు తన విధి నిట్లు చేయుచుండెను. పరిణామాలంకారము.

మహాదేవ రాజునకు గణపతి దేవరాజు పుట్టెనని చెప్పుచు—

శ్లో॥ అజని రజని కాంతా నంత భోగానురాగః
కపటసుభటభూపాటోపభీష్మా దముష్మాత్।

గణపతి రతివీరారాతి భూపాళకాళః
కదన సదన కృత్తోన్మత్త శుండాలదండః॥

మహాదేవుడు కపటసుభట భూపాలురకు భయంకరుడని చెప్పి వానివలన కాంతా నంతభోగానురాగుడైనట్టిన్నీ వైరి భూపాలురకు యముడునంటి వాడున్ను, యుద్ధములందు ఖండించబడిన మదపుటేనుగుల తొండములుగల వాడున్ను అగు గణపతి దేవుడు పుట్టెనని చెప్పెను. ఇందు లలిత పదప్రయోగముతో బాటు అను ప్రాస శ్లోకమునకు సొంపు జేకూర్చెను. మహాదేవరాజునకు గజాననుని యంశ ముగా గణపతిదేవుడు పుట్టెనని చెప్పినట్లు తోచును.

ఇట్లే గుండ సేనాపతి పుట్టుకను గూడ జెప్పెను.

శ్లో॥ అజని సుజనబంధు ర్బంధురాలాపలీలః
క్షపితకుపితశత్రుక్షత్రదోర్దండషండః।
సమర సమయశౌండో గుండయస్తత్ర తస్మాత్
గుహ ఇవ మహనీయ శ్శక్తి సంసక్త బాహుః॥

ఈ రెండు శ్లోకము లొకే భావము దెలుపుచు మాలినీ వృత్తములో నొకే శైలిలో బహుపదానుప్రాసములతో రచింపబడినవి. ఇచ్చటగుండయ గుహు నితో పోల్చబడెను.

అతని రాయ గరుడధ్వజమును గూర్చి—

శ్లో॥ యస్యోద్యద్ధ్వజ నద్ధరాయగరుడం దృష్ట్వా రవే స్సారథా
వశ్వానాం వినివార్య శీఘ్రగమనం ప్రేమోక్తి బద్ధోత్సవే।
దీర్ఘావాసర పద్ధతిః ప్రభవ తీత్యాలోచ్య యాత్రోద్యమే
నూనం చక్రకులం ధ్వజోన్నతి మిమాంప్రస్తౌతి విస్తారతః॥

ఇది యొక అద్భుత కల్పన . మల్యాల రెడ్లు తమ భుజబల పరాక్రమ ములతోను, అసమానమగు స్వామిభక్తితోను కాకతి రుద్రదేవుని, గణపతి దేవుని మెప్పించి వారిచే పెడముట్టుగండ, ద్వీపిలుంటాక బిరుదములను, కాక తీయుల నిజలాంఛనమగు రాయగరుడాంకమును బహూకరింపబడిరి. మల్యాల

గుండన యుద్ధయాత్రోన్ముఖుడై రాయగరుడాంకితమైన ధ్వజముతో బయలు వెడలుచుండగా చక్రవాకములు మిక్కిలి సంతోషించి విశేషముగ ప్రస్తుతించు చుండెనట. ఆ ధ్వజోన్నతి సూర్యమండలము వఱకు వ్యాపించి యుండుటచేత సూర్యసారథి యగు అనూరుడు ఆ ధ్వజముపై నధిష్ఠించియున్న తన సోదరు డగు రాయ గరుడుని జూచి వానితోటి ప్రేమోక్తులాడుటయం దాసక్తుడై సూర్యా శ్వముల శీఘ్రగతిని నివారించుటవలన పగటివేళలు దీర్ఘము లగుచుండెనట. ఇట్లు జరుగుట చక్రవాకములకు సంతోషదాయకము గనుక నవి గుండయ యొక్క పతాకోన్నతిని కొనియాడుచున్నవి, ఇందు ప్రస్తుతమైన పతాకోన్నతి సిద్ధమై యున్న పగటివేళ దీర్ఘమగుటకు హేతువుగ కల్పించబడెను.

మఱియొక వర్ణన—

శ్లో॥ పాతాళ మూళకళితాం శరదిందుశుభ్రా
మాళోక్య రాయగరుడోజ్జ్వలకీర్తి మాలాం।
శేషో విషణ్ణహృదయో నతమౌళి రా(సీ)
(ది) త్యాదరా ద్వసుమతీం స్వభుజే బిభర్తి॥

పాతాళమూలము దనుక వ్యాపించిన యీ రాయ గరుడుని (గుండయ) కీర్తిమాల జూచి శేషుడు విషణ్ణ హృదయుడై తలలు వంచుకొనెను. శేషుడు తన యెడ నట్టి గౌరవభావము జూపినందుకు ఆదరముతో గుండయ భూభారమును స్వభుజ ములపై మోసెను.

రాయగరుడ ధ్వజమును గూర్చిన మఱియొక వర్ణన—

శ్లో॥ రంగత్తుంగ ధ్వజవిరచితాధూత వస్త్రప్రశస్త
క్రీడానీడోల్లిఖితగరుడం వీక్ష్య యస్యామళస్య।
షుభ్యద్రాహుగ్రసన సమయాపేత చిత్తానువృత్యా
ప్రస్థానోద్యద్ధ్వజపట మిన స్తౌతి చంద్రోప్యతంద్రః॥

అత్యున్నతమైన ధ్వజముపైనున్న వస్త్రమున లిఖింపబడియున్న గరుత్మంతుని జూచి రాహుగ్రసన సమయమం దేర్పడెడి యాందోళన పోయిన (స్వస్థ) చిత్తాను వృత్తితో సూర్యచంద్రులాధ్వజపటమును ప్రశంసించుచుండిరి. రాహువు సర్ప

రూపముగ నుండును గనుక సర్పవిరోధి యగు గరుడుడుగల ధ్వజము జూచి రాహువు సమీపించడు గనుక భయము పోయిన చిత్తము వారికి గలిగెనని భావము. ఇచట గూడ ధ్వజోన్నతి వర్ణించబడెను.

అలంకారములేవి లేకుండ ఆ గుండయసేనాని గుణములను నామమాత్రముగ నిర్దేశించి చెప్పుటలో గూడ ఈ కవి యొక్క సహజశక్తి వ్యక్తమగుచుండును.

శ్లో॥ సంగీతే తురగాధిరోహణవిధౌ కోదండ శిక్షాక్రమే
చాతుర్యే వినయే విచిత్రవచనే బుద్ధౌ ప్రసిద్ధౌజసి ।
ఔదార్యే పరరాజ విక్రమకథా గాథాపహారే మహా
నిత్యుర్వీపతయ స్తువంతి య మతిస్తోత్రైకపాత్రం పరమ్ ॥

చిత్రకవితలో గూడ నీ మయూరభట్టోపాధ్యాయుడు కడు సమర్థుడు. శాసనాంతమున నీ క్రింది శార్దూలవిక్రీడితమును చక్రబంధములో రచించి చూపెను. (తెలంగాణ శాసనములు II- పుట 114)

శ్లో॥ నిత్యం గుంభిత మంత్ర నామ సదృశా కార ప్రచార స్పృశా
× = - — = ×
నక్రోడ ద్వీప యూపగేషు సరసష్కా చిత్రసానుప్రహదం ।
× = - — = ×
మన్యే వీర్య కరప్రశస్తి సదనం నీతంయశో తిక్షమా
× = - — = ×
మానాఖ్యా నిగదం నయస్థ మలికం శాఖిష్విదంతం రమా ॥
7 2 3 4 5 6

పై పద్యములో—గుర్తు పైనున్న యక్షరములతో నాగేశ శాసనం అని కావ్యము పేరు. ఒకటవ రెండవ, మూడవ పాదములలో రెండుమాట్లు చూడవలెను.

= గుర్తు పైనున్న యక్షరములతో మయూర రచితం అని కవి పేరు.

× గుర్తు పైనున్న యక్షరములతో గుండవీరనుతి అని కథానాయకుని పేరు.

1, 2, 3, 4, 5, 6 అంకెలపైనున్న యక్షరములతో నాగయ లిఖితం అని లేఖకుని పేరు.

మయూరభట్టు యొక్క వైదుష్యము కవితాశక్తి మనకు తెలియుటకు ఈ వర్ధమానపుర శాసనమే యేకైక సాధనము. ఇట్టి ప్రతిభాశాలియగు నీ విద్వన్మహాకవి నిజముగ 'అభినవ మయూరు'డే.

## 8. బయ్యారం శాసనము.

(భారతి 1967, ఏప్రిల్ 1-17)

గణపతి దేవునికి మైలాంబయను నొక సహోదరియు, కుందమాంబయను మఱియొక సహోదరియు గలరు. వీరిరువురు నతవాటి వారింటి కోడండ్రు. అందు మైలాంబ యిల్లెందు తాలూకా బయ్యారం వద్ద నొక గొప్ప చెఱువు త్రవ్వించి యచట మూడు శాసనములు స్థాపించెను. అందొక దానిలో వాటిని రామదేవుడను కవి రచించినట్లు చెప్పబడెను. ఆ శాసనాల్లో చెఱువు నిర్మాణమును గూర్చి వేయించిన శాసనము పెద్దదియు కొంత రమ్యముగను నుండును. చరిత్రకు కూడ నిది ముఖ్యమైనది.

మహాదేవుని వర్ణించుచు-

శ్లో॥ యః కర్ణస్య వివర్ణతాం సమతనోన్మానార్థ దానోద్యత
శ్చక్రే శక్ర నిరాకృతిం నిరుపమైశ్వర్యైక భూమి ర్భవన్।
కన్దర్పం గతరూపదర్ప మకరోల్లావణ్య పుణ్యాకృతిః
కస్తం వర్ణయితుం కవి ర్భువి మహాదేవక్షితీశం క్షమః॥

అనుప్రాసతో గూడిన అతిశయోక్తి. దానగుణములో కర్ణుని కంచెను, ఐశ్వర్యములో దేవేంద్రుని కంచెను, లావణ్యములో కందర్పుని కంచెను, మించిన మహాదేవుని వర్ణించుటకీ భూమిపై నే కవి సమర్థుడు ?

నతవాటి రుద్రుని వర్ణించుచు—

శ్లో॥ శూరోఽప్యారాన్నిజగురు జనాదేతి భీతిం సమగ్రాం
త్యాగీ సన్నప్యయతి నియతం లుబ్ధభావం గుణేషు।
సత్యంవాగ్మీ తదపివచనం నానృతం వక్తుమీష్టే
లోకోత్కృష్టో గుణనిధి రయం రుద్రదేవాభిధానః॥

శూరుడైనప్పటికి గురువుల యొద్ద భయపడుచుండును; త్యాగియైనను గుణగ్రహణమందు లుబ్ధభావము కలవాడు; మంచి మాటకారియైనను నిజమునే కాని అనృత

వాక్యము పలుకదు, ఇట్లు లోకోత్కృష్టుడై, గుణనిధి యయ్యెను. విరోధాలంకారము.

ఆమె శ్రీశైలాదిక్షేత్రములందు శివప్రతిష్ఠలు చేయుట, తన తండ్రి పేరున మహదేవపురము, తల్లి పేరున బయ్యవరము, తన పేరున (ధర్మకీర్తియను బిరుద నామముతో) ధర్మవరము అను గ్రామములు ప్రతిష్ఠించెనని చెప్పి, ధర్మకీర్తి పురమును వర్ణించును

శ్లో॥ క్వచి న్నానాదేశా దుపగత జనోల్లాఘన విధిః
క్వచి ద్దీనానాథ వ్రజకశిపు విశ్రాణన గృహాః।
క్వచిద్వాహారోహః క్వచిదపిచ కావ్యవ్యతికరః
క్వచిత్సంగీతశ్రీరిహ ముదముదగ్రాం విదధతి॥

ఆ నగరములో నొకచో నానాదేశములనుండి వచ్చిన రోగుల చికిత్సా విధానములు, ('వార్తో నిరామయః కల్య ఉల్లాఘో నిర్గతో గదాత్' అమరకోశము. ఉల్లాఘః = రోగనివృత్తియైనవాడు = చికిత్సపొందినవాడు; ఇచట ఉల్లాఘన విధి యనగా చికిత్సా విధానమని తోచుచున్నది); ఒకచో దీనానాథులకు వస్త్రదానము చేయు శాలలు, ఒకచోటున అశ్వారోహణప్రక్రియలు ఒక చోటున కావ్యగోష్ఠి, ఒక చోటున సంగీతగోష్ఠి కలిగి మిక్కిలి ముదావహమై యుండును. ఇదంతయు అతిశయోక్తి కాకపోవచ్చును. ఆ నాటి నగరములలో నిట్టి విశేషములుండుట సామాన్యము కనుక స్వభావోక్తియే యీ వర్ణన.

శ్లో॥ ధర్మకీర్తి పురహర్మ్యమండలీ
ఛాయయాపహృత లాంఛనశ్శశీ।
తత్సమస్త నగరీ ప్రశస్తతాం
ఛత్ర మచ్ఛమివ సూచయత్యలమ్॥

ధర్మకీర్తి (మైలాంబ) పురమందున్న హర్మ్యములయొక్క కాంతిచేత పోగొట్టబడిన మచ్చగల చంద్రుడు ఆ నగరముల గొప్పతనము చాటుటకై యెత్తిన తెల్లని ఛత్రమువలె నుండెను. ఇందు హర్మ్యముల యౌన్నత్యము, కాంతి చంద్రుని మచ్చనుగూడ పోగొట్టునంతటి గొప్పవని అతిశయోక్తి. తరు

వాత, కళంకరహితుడైన చంద్రుడు ఛత్రమువలె ఆ నగర ప్రాశస్త్యాన్ని చాటు చున్నట్లుండెనని యుత్ప్రేక్ష. రథోద్ధత వృత్తము.

ఆ తటాకముయొక్క విస్తృతినిగూర్చి

శ్లో॥ యశ్చాప్రపశ్చిమ సేతునాంబరతలం సస్యైః ప్రశస్తైర్మహీం
కుల్యాభిః కకుభో భుజంగభవనం గాంభీర్య ధర్మేణ చ।
తత్తత్స్వాశ్రిత సత్కథాభి రపిచ స్వర్గావనీమండల
వ్యాళస్థాని జనాననా న్యనుదినం వ్యాప్నోతి విశ్వాత్మవత్॥

ఏ తటాగము, తూర్పు దిశనున్న సేతువు (అడ్డుకట్ట)తో ఆకాశమును, ప్రశస్త సస్యములతో భూమిని, కాలువలతో దిక్కులను, గాంభీర్యముతో నాగలోకమును, దానినిగూర్చి చెప్పుకొను కథలతో కూడ కలిసి స్వర్గమర్త్యనాగలోక నివాసుల ముఖములం దనుదినము విశ్వాత్మునివలె వ్యాపించి యున్నది. అతిశయోక్తి. దాని సేతువును వర్ణించుచు అది అగస్త్యునిచే నిరోధింపబడిన వింధ్యాద్రియే తన పూర్వపు ఆకారమును విడిచి లోకోపకారబుద్ధితో నిచట పెరుగుచున్న యీ సేతువు నాశ్రయించెనా యేమి అన్నట్లును, జీవరాశి కభయ మొసగుచు భూదేవి చాచిన అభయహస్తమా యన్నట్లును తోచుచున్నదని యీ క్రింది శ్లోకములో జెప్పును.

శ్లో॥ వింధ్యాద్రిః కిము కుంభసంభవ మునే రాజ్ఞాప్రతిష్టంభిత
స్త్యక్త్వాకార మిహాఖిలోపకృతయే వర్ధిష్ణు మన్యం శ్రితః।
భూతానా మభయాయ బాహు రథవా ప్రాప్త ప్రసారః క్షితే
రిత్యా తర్కిత సేతురేతి హృదయం నిధ్యాయ తాం యో నృణామ్॥

పూర్వము వింధ్యాద్రి హద్దు లేకుండ పెరుగుచు సూర్యగమనము నడ్డగించి లోకోపద్రవమునకు కారణమయ్యెను. ఇపుడు లోకోపకారకముగ నీ సేతువు నాశ్రయించెనాయని సందేహము. ఆ సముద్రమువంటి తటాకము పొంగి లోకమున కుపద్రవము కలిగించకుండ జీవరాశి కభయమిచ్చుచు భూదేవి చాచిన హస్తమువలె కూడ ఉన్నదని వేఱొక సందేహము. మొదటిది సేతువుయొక్క యెత్తును తెలుపుటకును, రెండవది దాని పొడవును తెలుపుటకును చెప్పబడెను.

మఱియొక వర్ణన;

శ్లో॥ ఏ తత్పురీనివసన స్థిరచిత్త వృత్తిం
లక్ష్మీం నిరంతర దిదృక్షు రపామధీశః ।
శ్రీధర్మకీర్తి జలధి వ్యపదేశశాలీ
మన్యే కిమన్య దిహ సంప్రతి సన్నిధత్తే॥

ఈ ధర్మకీర్తి పురములోనే యెల్లపుడు నివసించు నభిలాషగల లక్ష్మీదేవి నెల్లపుడు చూచుచుండ వలయునను కోంకతో నా సముద్రుడే యీ ధర్మకీర్తి జలధియను వ్యపదేశముతో తాను కూడ నిచట స్థిరనివాస మేర్పరచుకొనెనా, లేకున్నచో మఱియేది యిచట ఇపుడు సంభవించును? ఇచట వ్యపదేశపదముతో తటాకము సముద్రముగ జెప్పబడెను. అపహ్నవము.

ఇట్లు అనేక వర్ణనలు ఈ బయ్యారం శాసనంలో అలంకారయుక్తముగ రచింపబడి యున్నవి.

## 9. కుందవర శాసనము

శకము 1135 (క్రీ. శ. 1213).
సెలెక్టు ఎపిగ్రాఫ్స్, ఆం. ప్ర. పుటలు 55-60.

గణపతిదేవుని మఱియొక సోదరి కుందమాంబ. ఈమె జనగామ తాలూకాలో నిడిగొండ గ్రామములో కుందేశ్వరాలయమును, నొక గొప్ప తటాకమును, అచటనే కుందవరమను అగ్రహారమును ప్రతిష్ఠించెను. అట్లే చెన్నూరు తాలూకాలో గోదావరి యుత్తరతీరమున నొక ఆలయమును, తటాకమును, అగ్రహారమును ప్రతిష్ఠించెను. నిడిగొండయొద్దనున్న శాసనము శిథిలమయ్యెను. చెన్నూరు తాలూకాలో కుందవరంలోనున్న శాసనము బాగున్నది. ప్రస్తుతమది చెన్నూరు పంచాయితీ కార్యాలయము దగ్గరనున్నది. శాసనము లించుమించు సమానముగనే యున్నవి. వీటి రచయిత బాలభారతి యని పేర్కొనబడెను. ఇది బిరుదము కావచ్చును. ఇందలి కవిత్వము పదలాలిత్యము గలిగి, దీర్ఘ సమాసములంతగానుండక, క్లిష్టపదభూయిష్ఠముగాక ద్రాక్షాపాకమున రమణీయముగ నుండును. రచయిత బాలభారతియని పేర్కొను శ్లోకము—

శ్లో॥ సూక్తిముక్తావలీ భాతి బాలభారతి సత్కవేః।
సుగుణైః కుందమాంబాయా యామహీ హృదయంగమా॥

కుందమాంబయొక్క సుగుణములనెడి మంచి దారములతో గూర్చ లోకమున హృదయంగమమై (భూదేవికి హృదయభాగమున ధరించదగిన బాలభారతి సత్కవియొక్క సూక్తులనెడి ముత్యముల హారము ప్రకాశి చున్నది.

కుందవరాగ్రహారమును గూర్చి చెప్పినది కూడ నిట్టి యర్థమ తెలుపును.

శ్లో॥ విరాజతే కుందపురాగ్రహారః సరస్వతీ తుంగకుచాగ్రహారః।
భూదేవరత్నాని వినిర్మలాని స్ఫురన్తి యత్రోజ్జ్వల వృత్తవన్తి॥

కుందపురములోనున్న విద్వన్మణులతో సరస్వతీదేవికి కుచహారమేర్ప చుండెనని అచటి విద్వాంసుల విద్యాప్రకర్ష కొనియాడబడెను. వారి పక్షము సత్ప్రవర్తనగలవారని, రత్నముల పక్షమున ప్రకాశించుచు వృత్తాకారమ గలవని అర్థము.

శాసనాది యందు జగదావిర్భావమును గూర్చి యిట్లు చెప్పును:

శ్లో॥ శ్రీకాన్తః కమలేక్షణో విజయతే విష్ణు ర్యదీయేచ్ఛయా
విశ్వోద్భూతి రజో రజోమయతను స్తన్నాభిపద్మా దభూత్।
నాగాధీశ్వర నాలదిగ్దల చలత్తారావళీ కేసర
స్వర్ణక్షోణిధరేంద్ర కర్ణికజగ త్పద్మస్య జన్మాశ్రయః॥

శాసనమంతటను స్వల్పసమాసములు వ్రాసినను ఇందుమటుకు మూడు, నాలుగు పాదములలో నొకే దీర్ఘసమాసము వాడెను. శ్రీకాన్తుని నాభి పద్మము నుండి రజోమయుడగు నజుడు జనించెనని చెప్పి, ఆ బ్రహ్మ మఱల యీ జగత్తనెడి పద్మముద్భవించుటకు హేతువయ్యెనని చెప్పి ఆ దీర్ఘ సమాసములో వర్ణించును. జగత్తును పద్మముతో బోల్చుటకై యనేక రూపకములాసమాసములో వాడెను. అందు నాగాధిపతియను నాలము, దిక్కులను దళములు, చలించు తారావళియను కేసరములు, మేరువను కర్ణిక గలదీ జగత్పద్మమని చెప్పెను.

త్రిభువనమల్ల బేతరాజును గూర్చి—

తత్రాభూ త్త్రిభువన మల్లనామధేయః
సత్కీ ర్తి ర్జగదుప జీవ్య భాగధేయః
లోలాక్షీ హృదయవిహారి రూపధేయః
సంత్రాణే చరణజుషాం కృపావిధేయః॥

ఈ ప్రహర్షిణీ వృత్తములో పాదాంతములందు నామధేయః, భాగధేయః, రూపధేయః, కృపావిధేయః అని పాదాంతయమకము.

ప్రోలరాజును, రుద్రదేవుని గూర్చిన శ్లోకములు గూడ రమ్యముగ నుండును. మహాదేవుని గూర్చి--

శ్లో॥ తస్మాదనంతరం తస్య మహాదేవో మహీపతిః।
అనుజో మనుజాకారమహాదేవో మహీమధాత్॥

అతడు మనుజాకారము బొందిన సాక్షాత్తు మహాదేవుడని చెప్పి దానిని సమర్థించును.

శ్లో॥ రాజోత్తంసమణీ రరాజ స మహాదేవో విభూత్యుజ్జ్వలః
సౌభాగ్యోర్జిత భాగ్యబయ్యల మహాదేవీ మనోవల్లభః।
యస్యాసీ న్మద సింధురో వృషపతిః సేనాగ్రగణ్యాగణా
విద్వి ట్పుం హరణే రణేఽగ్నినయానాటోపః ప్రతాపః పునః॥

ఇందు శ్లేష పదములతో మహారాజును ఈశ్వరునితో బోల్చును. రాజోత్తంసమణిః = చంద్రుడు శిరోమణిగాకలవాడు, రాజులలో శ్రేష్ఠుడు; మహాదేవః = ఈశ్వరుడు, మహాదేవరాజు; విభూత్యుజ్జ్వలః = విభూతితో ప్రకాశించువాడు, ఐశ్వర్యముతో నున్నవాడు; బయ్యలమహాదేవీ మనోవల్లభః= బయ్యనదేవునిదేవి బయ్యలదేవియందురు, ఆమె మనోవల్లభుడు ఈశ్వరుడు, శ్రీ పర్వతప్రాంతమున బయ్యన్న అను పేరుతో శివుని బయ్యమ అని ఆ దేవిని కొలుచుట ఇప్పటికిందు, ప్రకృతమందు మహాదేవరాజు బయ్యలదేవి భర్త; మహాదేవుని మదగజము సాక్షాత్తు శివుని నందీశ్వరావతారమే; ఈ రాజుయొక్క సేనాగ్ర గణ్యులు

ఈశ్వరగణములోనివారే; శత్రు సంహారవిషయములో మహదేవరాజు యొక్క ప్రతాపము ఈశ్వరుని ఫాలలోచనముకుండి వెలువడు అగ్నిజ్వాలవంటిదే.

ఆ మహదేవుని కొడుకు గణపతి దేవుని గూర్చి—

శ్లో॥ తస్యాత్మజో గణపతి ర్గలి తారిగర్వ
స్సర్వం సహావలయ సర్వధురీణపాణిః।
కీర్తే ర్విహార మఖి సందధతేవ యేన
నిష్కంట కీకృత మిదం భువనా న్తరాలమ్॥

ఈ భూవలయము యొక్క సమస్తభారముువహించ సమర్థమైన భుజముగల గణపతి ఆ మహదేవరాజునకు పుత్రుడు. ఎవనిచేత కీర్తి (కాంత) యొక్క విహారము కొఱకునలె ఈజగత్తు కంటకరహితముగ (శత్రువులు, చోరులు, దుష్టులు లేకుండగ) జేయబడెనో. ముళ్లతొలగించి కీర్తికాంతచే స్వేచ్ఛా విహారము జేయించెనని యర్థము. ఉత్ప్రేక్ష.

గణపతి తరువాత కుందమాంబ పుట్టెనని చెప్పను-

శ్లో॥ శశ్వ త్సంపరిపూర్ణమండలయుతే ముక్త్వా కలంకం పున
ర్జన్మ శ్లాఘ్యమితే కలాభృతి చలాచారా చ లక్ష్మీస్థిరా।
భూత్వాఽభూదితి భూనుతౌ గణపతౌ జాతేఽనుజాతా జగ
ద్విఖ్యాతా జగతీహ కున్దంమహాదేవీ గుణానాం నిధిః॥

ఎల్లప్పుడు పరిపూర్ణబింబము గలిగి, కలంకరహితుడై చంద్రుడు శ్లాఘనీయ మగు మఱియొక జన్మము పొందినట్లు గణపతిదేవుడు భూనుతుడైయుండగా వాని తరువాత గుణనిధియగు కున్దంమహాదేవి యీలోకమున చంచలస్వభావము గల లక్ష్మీదేవి స్థిరస్వభావముగలదై పుట్టెనాయన్నట్లు విఖ్యాతి జెందెను. వ్యతిరేకమూలక ఉత్ప్రేక్ష.

ఆమె కీర్తినిట్లు వర్ణించును—

శ్లో॥ సుస్నిగ్ధ లహరీరుచి జిత్వరీషు
యత్కీర్తిషు ప్రతిదిశం ప్రతిసృత్వరీషు।
క్షీరోద గర్భవసతిః పురుషోత్తమే న
సాధారణీ ధ్రువ మభూ జ్జగతీజనానామ్॥

అతి స్నిగ్ధమగు పాంతరంగములు కాంతులను ఇయించిన ఆమె కీర్తులు దిక్కులంతట వ్యాపించగా, క్షీరసముద్రగర్భమున నివసించునట్టి గొప్పతనము ఒక్క పురుషోత్తమునియందే కాక జగత్తులోని జనులకందఱికి సాధారణ విషయమయ్యెను. బాలభారతి యొక్క అద్భుతమగు కల్పనాచాతుర్యమునకిది చక్కని యుదాహరణము.

ఆమెను గూర్చి మఱియొక వర్ణన-

శ్లో॥ భూయ స్త్రీషు విభాతి కున్దలమహాదేవీ యదంఘ్రిద్వయీ
రాగః కల్పమహీజపల్లవచయై శ్చిన్తామణి శ్రేణిభిః ।
ఉత్తంసం నవ మాదధాతి వినమత్సామన్త సీమన్తినీ
సీమన్తోదరసీమని ద్విగుణయ స్సిందూర రేణుశ్రియమ్ ॥

ఆ కున్దందేవి స్త్రీలలో మిక్కిలి సౌందర్యాతిశయముగలదై యుండెను. సామన్త రాజుల పత్నులు ఆమె పాదములు మ్రొక్కగా నామె పాదద్వయము నుండి వెడలు కాంతులు వారి సీమన్తములందున్న సిందూర శోభ నినుమడింప జేయుచు కల్పమహీజపల్లవములతోను, చిన్తామణి శ్రేణులతోను అలంకరించ బడిన నూతన శిరోభూషణములుగా ప్రకాశించుచుండెను. ఆమె కాలివ్రేళ్లు కల్ప తరు పల్లవములతోను, గోళ్ళు చిన్తామణి పంక్తులతోను పోల్చబడెను. రూపక సంశ్లిష్ట అతిశయోక్తి అనుప్రాస.

ఆమె త్రవ్వించిన కుందసముద్రమను తటాకమును గూర్చి-

శ్లో॥ శ్రీమత్కున్దసముద్రోఽసౌ సముద్రా దతిరిచ్యతే।
అక్షయో నిష్కలంకశ్చ కీర్తిచంద్రో యతోఽభవత్॥

సముద్రములో బుట్టిన చంద్రుడు క్షయము బొందుచుండును; అట్లే కలంకము గలవాడు ఈ కుందసముద్ర వలన బుట్టిన కీర్తిచంద్రునికి ఆ రెండు దోషములు లేవు. కనుక సముద్రముకంటె ఈ తటాకమే మిన్నయై యుండెనని వ్యతిరేకము.

కుందమాంబ చేసిన ధర్మములనేకమని—

శ్లో॥ శేష స్త్విషతు శేష ఏవ కుశలః శ్రీకున్దమాంబా కృతాన్
ధర్మా న్వర్ణయితుం ధరాస్ఫురదలంకారా న్సహస్రాననః ।

రాకాచన్ద్రికలాకలాపవిలస త్సత్కీర్తిసంకీర్తనాత్
తస్యా వ్యస్తు విషం విహాయ రసనాశ్రేణీ సుధాస్యన్దినీ॥

ఆ కుందమాంబ చేసిన ధర్మములను వర్ణించుటకు సహస్రవదనములుగల ఆ శేషుడే సమర్థుడై మిగులును. మఱెవ్వరు తగరు. రాకాచంద్రునివలె ప్రకాశించు ఆమె సత్కీర్తిని (అమృతము వంటిదానిని) సంకీర్తనము చేయగా ఆ శేషుని రసనాశ్రేణి విషము పోగొట్టుకొని అమృతస్యన్దిని కూడనగును. (లేకున్నచో) విషపు నాలుకలతో నామెయొక్క సద్ధర్మములను గుర్తించుట యనుచితము. అతిశయోక్తి. కావ్యలింగ స్ఫూర్తి.

కున్దమాంబను నతవాడి రుద్రునకిచ్చి వివాహము జేసినట్లు—

శ్లో॥ అస్మై కున్దలదేవీం రుద్రనృపా యాదదా న్మహాదేవ నృపః।
మురపుర విజయి భ్యా మివ రమా ముమా మమల నిమ్నగేశ నగేశౌ॥

కాకతిమహాదేవనృపుడు తన కూతురైన కున్దలదేవిని నతవాడి రుద్ర నృపున కిచ్చి యుద్వాహము చేసెనని రెండు పూర్ణోపమలతో వర్ణించెను. నదీపతి (సముద్రుడు) రమాదేవిని మురవిజయికి (విష్ణువునకు) వలెను, నగేశుడు (హిమవంతుడు) ఉమాదేవిని పురవిజయికి (శివునికి) వలెను.

కుందవర శాసనములో నీక్రింది శ్లోకములు గూడ రమ్యముగ నుండును.

నతవాడి బుద్ధ భూపాలుని గూర్చి—

శ్లో॥ తత్సుతో బుద్ధభూపాలో యస్య నీతి ర్మతి ర్ధృతిః।
కులస్త్రియః కలా స్సర్వా విలాసిన్యో విలాసినః॥

బుద్ధ భూపాలునికి నీతి, మతి, ధృతి వివాహమాడిన కులస్త్రీల వలె నుండెను. కళలన్నియు విలాసవంతుడగు నతనికి విలాసినీ స్త్రీలవలె నుండెను.

కుందమాంబ కొడుకు మాధవుని గూర్చి—

శ్లో॥ విద్వత్కామిత కామధేను రసయోస్సూనుః ప్రతాపస్ఫుర
ద్భాను ర్గౌరవరత్నసాను రఖిలఖ్యాతో విసీతో భవత్।

తారా తారగిరీంద్ర చంద్ర మఘవన్మాతంగ గంగానదీ
గౌరీశాంగ సమాంగమంగళ యశో రామాధవో మాధవః ॥

ప్రతాప స్ఫురద్భానువు, గౌరవ రత్నసానువు, ఖ్యాతుడు, వినీతుడు, నక్షత్రములు, వెండి, కొండ, చంద్ర, ఐరావతము, గంగానది, శివశరీరము లతో సమానమైన మంగళయశోరామకు ధవుడు ఆమాధవుడు.

ఆమె యగ్రహారముగ నిచ్చిన కుందవరమును గూర్చి—

శ్లో॥ స్వప్నే ప్యధర్మస్య న యత్ర వృత్తి
స్తస్మి న్కథం కుందపురే ద్విజానాం।
సౌధావలీధామచకోరపక్షి
పక్షోపవాస వ్రతభంగకారీ॥

స్వప్నములో కూడ అధర్మ వృత్తిలేని యచటి ద్విజులకు (బ్రాహ్మణులకు) అధర్మమెట్లు సంభవించును ? కాగా, ద్విజమగు చకోరపక్షి యచటి సౌధావలిపై నున్నదై (వాటి తెల్లని కాంతి నాశ్రయించినదై) పక్షోపవాస వ్రత భంగము గావించుచుండెను. (తన రెక్కలపై నిలబడి వెన్నెలను గ్రోలకుండెను). బ్రాహ్మల విషయమున పక్షోపవాసము ఆచరించకుండుట అధర్మము. శ్లేష.

ఆమె నిర్మించిన త్రికూటాలయమును వర్ణించును—

శ్లో॥ శ్రీకుందేశ్వరధామ ధామ చ హరే ర్ధామాపి ధామ్నాం నిధే
రామ్నాయత్రితయాభిరామవపు రప్యేత త్త్రికూటం మహత్।
త్రైలోక్య ప్రణుతం త్రివర్గ ఫలదం త్రైకాల్య భోగోర్జితం
కైలాసామృతవారిరాశి బలభిచ్ఛైలేంద్ర లీలాస్పదమ్॥

కుందేశ్వరాలయము, విష్ణ్వాలయము, భాస్కరాలయము, ఈ మూడింటితోనైన త్రికూటాలయము ఆమ్నాయ త్రితయమువలె నభిరామముగ నుండుటయు, మూడు లోకములకు వంద్యము, ధర్మార్థకామములనెడి త్రివర్గ ఫలప్రదము, త్రికాలములందును భోగోర్జితమునై మూడును క్రమముగా, కైలాసమువలెను, అమృత సముద్రము (క్షీరాబ్ధి) వలెను, మేరువువలెను శోభిల్లుచుండెను.

ఈ యుదాహృత శ్లోకములను బట్టి బాలభారతియొక్క ప్రతిభావిశేషము, ఆనాటి ఓరుగంటి విద్వాంసుల విద్యాప్రమాణములు, ఆ రాజుల రసజ్ఞత తెలియుచున్నవి.

## 10. దుర్గి శాసనము.

శకము 1173; క్రీ. శ. 1251

**దక్షిణ హిందూ శాసన సంపుటి-10;334.**

గణపతి దేవుని కొలువులో కాయస్థ వంశజుడు గండపెండార గంగయ్య సాహిణి యొక ప్రసిద్ధ అశ్వదళాధిపతి. చక్రవర్తి యితనిని మార్జవాడి నుండి పానుంగల్లు వఱకు గల రాజ్యమునకు మండలాధిపతిగ జేసి రాజలాంఛనములు బిరుదము లొసగిన సందర్భమున తనకు తోడ్పడిన నామదేవ పండితుడను కాయస్థ మంత్రి మాచర్ల దగ్గర దుర్గియను చోట వంకేశ్వరాలయము కట్టించగా దానికి గంగయ సాహిణి ఎయ్యూరు గ్రామము దానము చేయుచు ఈ శాసనము వేయించెను. అందు కొన్ని ప్రశస్తి శ్లోకములు.

ప్రోలరాజును గూర్చి-

శ్లో॥ తస్మిన్కులే పాలయితా ప్రజానాం
ప్రోలక్షితీశోఽ లభ తాత్మలాభం।
ఆజ్ఞా యదీయా రిపుశేఖరాగ్ర
మణిప్రభాసఖ్య మవాప నిత్యమ్ ॥

అతని ఆజ్ఞ రిపు శిరస్సులపై మణులతో బాటు ధరించ బడుచున్నది.

రుద్రదేవుని గూర్చి-

శ్లో॥ ఆసీత్సుత స్తస్య భువోఽథ భర్తా
శ్రీరుద్రదేవః ప్రథిత ప్రభావః।
యత్ఖడ్గ మాప్తా రిపవ స్సురేంద్రా
స్సంతోఽన్వమన్యంత యమేవ మిష్టమ్ ॥

అతని ఖడ్గము పొందిన శత్రువులు సురేంద్రులగుచు వానినే ఆప్తునిగా భావించిరి.

గణపతిదేవుని గూర్చి-

శ్లో॥ యస్మిన్ శాసతి మేదినీతలపురీ మంభోధిఖాతాంకితా
మాజ్ఞాదుర్గమనోరమాం క్షితిపతిప్రోత్తుంగ సత్తోరణాం ।
ధర్మో వృద్ధిమవాప్నుయా ద్విజవరా స్సర్వత్ర సంవర్ధితా
స్సద్భక్తి ర్గురుష న్పుటా సమభవ ద్భాస్త్రీమ ధీ స్సుస్థితా॥

గంగయ సాహిణి గుఱ్ఱముల ధాటిని గూర్చి-

శ్లో॥ యద్ధాటీ తురగావలీ పృథుఖుర క్షుణోత్థిత క్ష్మారజః
ప్రచ్ఛన్నాః ప్రవిలోక్య తా దశదిశో భీతా వదంతి స్ఫుటం ।
దైవజ్ఞా వయ మాదితాపసగణా స్సద్బ్రాహ్మణా శ్శాంభవాః
స్పష్టం కర్పటికా వయ మహో న క్షత్రియాః పార్థివాః ॥

ఆ యశ్వముల ఖురములచే నెగురగొట్టబడిన దుమ్ముతో దిక్కులావరింపబడుట జూచి భయముతో రాజులు 'మేము దైవజ్ఞులము, తాపసులము, బ్రాహ్మణులము, శైవ సాధువులము, జైన సాధువులము కాని క్షత్రియులము కాము' అని మాఱు వేషములుధరించి ప్రాణములు రక్షించుకొనుచుండిరి.

ఇందు కొన్ని శ్లోకములు స్పుటముగ లేవు.

## 11. విశ్వేశ్వర శివుడి శాసనాలు

శకము 1182-3; క్రీ శ. 1260-1

ద. బా శా.- 10; 395

గణపతిదేవునికి, రుద్రమదేవికి రాజగురువుగ ప్రసిద్ధినొందిన విశ్వేశ్వర శివాచార్యుడు మల్కాపుర శాసనము, కొన్ని త్రిపురాంతక శాసనాలు, కాళేశ్వర, చంద్రపల్లి శాసనాలు రచించినట్లు తోచును. వీటిలో మల్కాపుర శాసనం ముఖ్యమైనది. అందు కాకతీయ వంశమును గూర్చి, తన గోళకి మఠాచార్య వంశమును గూర్చి ప్రశంసించును. అందుండి కొన్ని శ్లోకములు.

శ్లో॥ వితరతు భగవా నసౌ శ్రియంవః కరివదనో హరిసింహాసి యస ।
ద్యుతిపర సరసి స్ఫురత్తరంగ శ్రియ మధితా మణిపంక్తయో వహన్తి ॥

ఎవని యింద్ర నీలకాంతులనెడి సరోవరమున తుమ్మెదల పంక్తులు తరంగ శోభను వహించుచున్నవో అట్టి గజాననుడు మీకు సంపద నొసగుగాక!

శ్లో॥ జయ తీందోః కలా ఖేలద్గంగాంభఃకణదంతురైః ।
కరైః కరోతి యా శంభో ర్మూర్ధ్ని ముక్తావళి శ్రియమ్ ॥

దొర్లుచుండు గంగనీటి తుంపరలు గల కిరణములతో శివుని శిరసుపై ముక్తావళి శోభను కూర్చుచున్న చంద్రకళ శోభించుచున్నది.

శ్లో॥ జయతి భగవాన్ స్వయంభూ ర్గణపతినృపతే ర్హృది స్థిత స్సతతం ।
యత్కారుణ్యకటాక్షై ర్వృద్ధిం ప్రాప్తాంధ్రదేశశ్రీః॥

ఎవ్వని కారుణ్య కటాక్షములతో నాంధ్రదేశ లక్ష్మి వృద్ధి నొందెనో ఆ స్వయంభు దేవుడు సతతము గణపతి దేవుని హృదయమందున్నవాడై జయ మొందుచున్నాడు.

మహాదేవుని కీర్తిని పొగడుచు-

శ్లో॥ కుందేందు చందన సఖః కుముదస్య మిత్రం
స్వ స్సింధు సింధుర తురంగ రుచాం సనాభిః ।
కర్పూరహార హరహాస పయఃపయోధి
బంధుర్విభాతి యదుదార యశోవిలాసః ॥

ఇచట కీర్తిని కుంద, ఇందు, చందన, కుముద, స్వర్గంగ, ఐరావత, ఉచ్చైశ్శ్రవ, కర్పూర, హార, హరహాస, క్షీరసముద్రములతో పోల్చెను.

గణపతి దేవుని గుణముల గూర్చి-

శ్లో॥ దర్పో ధన్వని, మత్సరో రణజయే, ధార్ష్ట్యం ద్విపారోహణే,
క్రౌర్యం శౌర్యవిధౌ, తురంగదమనే చాపల్య, మాశా యుధి ।
క్రోధో దుష్టజనే, భయం ద్విజధనే, లోభశ్చ ధర్మార్జనే,
పూజా కర్మణి శాంకరే గణపతి క్షోణీపతే ర్వాగ్రహః ॥

రుద్రమదేవి కీర్తిని మఱియొక విధముగ వర్ణించును.

శ్లో॥ ఆక్రామంతి తరత్తరంగ వికళ ద్దుగ్ధాబ్ధి ఫేనావలీ
రాచామంతి శరచ్చశాంక విశద జ్యోత్స్నాప్రవాహామృతం ।
ఆకర్షంతి సురేంద్ర దంతి దశన ప్రాగ్భారలగ్నాం శ్రియం
ముక్తాహారలతాయితాః ప్రతిదిశం రుద్రాంబికా కీర్తయః ॥

ఆ కీర్తులు దుగ్ధాబ్ధియొక్క తరంగముల నుండి వెడలిన ఫేనావళి నాక్రమించు చున్నవి, శరచ్చంద్ర చంద్రికా ప్రవాహామృతమును గ్రోలుచున్నవి, ఐరావతము యొక్క దంత లగ్నమగు శోభ నాకర్షించు చున్నవి, దిక్కాంతలకు ముక్తాహారములగుచున్నవి.

విశ్వేశ్వరాచార్యుని గద్య రచనలు గల శాసనాలు త్రిపురాంతకములో గలవు. అందొకటి—

''స్వస్తిశ్రీ సమస్త విద్యా విలాసినీలాసక రసిక, సకల జలనిధి వేలామేఖలా వలయిత వసుమతీవలయ విజయమాలాకలితభుజశిఖరోత్తంస, సహస్రాంశు వంశావతంస; సమర సమ సమయ సమాహన్యమాన నిస్సాణ ఘోషసమాకర్ణన విసర్ప ద్బాష్ప ధారాధౌత ప్రతిభట భటీగండేన, చలమర్తి గండేన; ప్రణత నరపతి మణిమకుట కోటిమకరికా చుంబ్యమాన చరణనఖ కిరణ కందలేన, మూరురాయ జగదలేన; కరకలిత కరవాళ క్షపిత విపక్ష విలాసినీ విశంబ్యమా నాలకవల్లరీ వినిస్సారిత లలాటతట కస్తూరికా తిలకేన, కాకతికుల తిలకేన; అఖిల జలధి మథన శూరభుజస్తంభ పరాక్రమాపహసిత మందరేణ, జగదేక సుందరేణ; కవికుల కమలాకర దివాకరేణ, సకల గుణగణ రత్నాకరేణ, విభవ వినిర్జిత విబుధ రాజేన, గణపతి మహారాజేన, పరివస్యమానః......''

గద్య కావ్యశైలి యిందు కనపించుచున్నది. ప్రతి దీర్ఘ సమాసమునకు తోడుగ వెంటనే యొక హ్రస్వ సమాసము అంత్యానుప్రాసముతో నుండును.

## 12. బూదపుర శాసనము

శ. 1194; క్రి. శ. 1272

కార్పస్ II-పుటలు 140-160

రుద్రమదేవి కాలమునకు చెందినదీ శాసనము.

గణపతి దేవుని కాలములో వర్ధమాపురములో మల్యాలగుండయ వేయించిన శాసనములను ఈశ్వరభట్టోపాధ్యాయుని కొడుకగు మయూరసూరి రచించినట్లు చెప్పియుంటిమి. ఈ మయూరుని కొడుకు రెండవ ఈశ్వరభట్టోపాధ్యాయుడు, ఈయనకూడ తండ్రి, తాతలవలె గొప్ప విద్వాంసుడు. పదక్రమయుతయజుర్వేదపారగుండును, శబ్ద విద్యావిశారదుండును, కవీశ్వరుండును ఈ యీశ్వర సూరి. ఇతనును తండ్రివలె చిత్రకవిత జెప్పనేర్చిన ప్రోఢ. ఉదాహరణములు-

శ్లో॥ పోత్రీ ధాత్రీసతీలోద్ధరణ పరిణతః శ్రీధరఃపాతు యుష్మాన్
(ఈషత్) సోష్మక్షణోత్థ శ్వసనపరిహృతాపార నీరప్రపూరః।
యద్దంష్ట్రి దండలగ్నా క్షితి రతిలసతి ప్రస్ఫురద్గర్వవప్ర
క్రీడాసంసక్తరేణుః శ్రియమియ మురరీకుర్వతీ పర్వతాంకా॥

ఇది ఆర్యా గర్భము. మొత్తము స్రగ్ధరలో నున్నది. మొదటి పాదములో 'పోత్రీ', రెండవదానిలో 'ఈషత్', మూడవదానిలో 'యత్', నాలుగవదానిలో 'క్రీడా' అను యక్షరములను దీసిన ఆర్యావృత్తములగును.

నిర్దంత్యమున కుదాహరణము—

శ్లో॥ శ్రీబాహో బహురాగకారి రుచిర క్రీడాకరః శ్రీకరః
శ్రీయశ్శ్రేణిమరంక పిష్ట పరమాం యుష్మాక మీశః శ్రియః।
ధమ్మి ప్రక్రమడంబరాంబరపరప్రాచుర్య చర్యాక్షర
క్షీరాపార గభీరకూబర పయోరాశి ప్రకాశాశయః॥

నిష్కంఠ్యమున కుదాహరణము—

శ్లో॥ నిరీతి నీతి సుప్రీతి భూరిభూతి నతి ద్యుతిః।
సురీనిధి ధృతిస్ఫూర్తిః శ్రీసూతి భువినిద్విషి॥

తటాకమును గూర్చి

శ్లో॥ సద్ధాతువృద్ధ పృథ్వ్యాది సమాసాళీ సమన్వితః।
నదీపూరణ సంపూర్ణః పాణినీయయతే చ యః ॥

శాసనరచయిత ఈశ్వరసూరి పాణినీయుడు. ఈ తటాకమును శబ్దశాస్త్రముతో పోల్చుచున్నాడు. ధాతువులు, వృద్ధ సంజ్ఞ, పృథ్వ్యాది గణము, సమాసములు, నదీసంజ్ఞ, పూరణార్థకములు, వ్యాకరణశాస్త్రమునందు ప్రసిద్ధములు. తటాక పక్షమున. మంచి ధాతు (జలము)తో వృద్ధి పొందినది. గొప్పది, సంక్షిప్తమైన అడ్డుకట్టగలది. నదీజలముతో పూరింపబడి, సంపూర్ణమైనదని అర్థము.

వేరొక శ్లోకములో లిట్ప్రయోగముతో గణపతిదేవుని ప్రశంసించును.

శ్లో॥ శత్రూనాశు పిపేష వీరనిరతాన్ బంధూన్పుపోష త్మనో
దారేష్వేవ తుతోష నిత్యవిలస న్నీత్యోన్మిమేష క్షితౌ।
సౌందర్యంచ ముమోష శంబరరిపో ర్విశ్వం వివేశత్విషా
సద్ధర్మం విశిశేష యః పరహితం తోషాదియేష ప్రభుః॥

(గణపతిదేవుడు) శత్రువులను పిండి చేసెను, బంధువులను పోషించెను. స్వదారయందే తృప్తి నొందెను (సంతోషించెను), నీతితో (ప్రకాశించెను), మన్మథుని సౌందర్యమును దొంగిలించెను, కాంతితో లోకము నింపెను, సద్ధర్మము నభ్యసించెను.

శ్లో॥ నిరాకరిష్ణు స్సమరేఽరివీరా
నలంకరిష్ణు శ్చరణౌ శివస్య।
వర్ధిష్ణు రాసీర్భి రసౌ సమేషాం
వర్తిష్ణు రధ్వ న్యసకృత్సతాంచ॥

మఱియొకటి—

శ్లో॥ దిక్కాన్తా పరివేలితేఽతి వితతే రంగేధరిత్రీ తలే
దీప్రాయామంద రవీందుసాందరతర ప్రోద్య త్ప్రదీపాంచితే।
స్తోత్రాలాప కలాప బంధురవచోవాదిత్ర ధీరస్వనై
ర్నిత్యం నర్తయతే ముదా కవిసదో యత్కీర్తి రామామిమామ్॥

ఎవని కీర్తికాంత దిగన్త వ్యాప్తమైన యీ ధరిత్రీమండలమున కవిగాయకాదులతో నాట్యమాడించబడుచున్నదో- అని గణపతిదేవుని ప్రశంస.

గణపతిదేవుని రాజ్యకాలంలో వెలువడిన ప్రధాన శాసనాలు మంచి సాహిత్యముతో కావ్యశైలిలో రచింపబడినవి. సాధారణముగ నవి ఆయా సామంత నాయకుల బలపరాక్రమాది వర్ణనలతోను, వారు నిర్మించిన దేవాలయ వర్ణనలతోను, త్రవ్వించిన తటాకముల వర్ణనలతోను, ప్రతిష్ఠించిన గ్రామముల వర్ణనలతోను, సందర్భోచితమగు నలంకారములతో గూర్చి రచింపబడినవి. ఈ కాలమునాటి రచయితలందరు విద్వత్కవులు, పాకాల చెఱువు శాసనము, చేబ్రోలు శాసనము రచించిన కవిచక్రవర్తి, మైలాంబ శాసన రచయిత రామదేవుడు, కుందాంబ శాసన రచయిత బాలభారతి, మల్యాలగుండ సేనాని శాసన రచయిత మయూరసూరి ఆయా శాసనములందు బేర్కొనబడిరి. ఈ మయూర సూరి పదవాక్యప్రమాణ ప్రమేయ విచిత్ర కవిత్వ తత్త్వజ్ఞుడని చెప్పబడెను. సాధారణముగ తర్కవ్యాకరణములు నేర్చిన వారికి కవిత్వమలవడదు. తుచ, తప్పకుండ అతివ్యాప్త్యవ్యాప్తులనెంతమాత్రము సహింపక సూత్రములనుండి శాస్త్రముల నభ్యసించువారు పదవాక్యప్రమాణ ప్రమేయజ్ఞులు. అట్టివారికి అతిశయోక్తులు, విరోధాభాసలు, ఉత్ప్రేక్షలు అలవడుట కష్టసాధ్యము. గణపతిదేవుని రాజ్యమందున్న పైజెప్పిన శాసనకవులందరు గొప్ప శాస్త్రజ్ఞులని వారి రచనలు తెలుపుచున్నవి. ఆచే కావ్యరచనలోగూడ వీరు సిద్ధహస్తులని తోచును. కాని యీ శాసనములుగాక వీరి యితర రచనలేవియు బయల్పడలేదు. కొండపర్తి, పాలంపేట శాసనముల రచయితల పేర్లు చెప్పబడలేదు. గణపతిదేవుని కాలములోనివిగా మన కుపలభ్యమగుచున్న గ్రంథములలో జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళి యను లక్షణ గ్రంథమొకటి. ఇతడు వాద్య రత్నావళి, గీత రత్నావళి యను మఱి రెండు లక్షణ గ్రంథములు గూడ రచించెనని చెప్పుదురు. అవి మనకు లభ్యమగుట లేదు

గణపతిదేవుని యాస్థానమున త్రిభువన విద్యాచక్రవర్తియను ప్రసిద్ధ నామము వహించిన మంచి భట్టోపాధ్యాయుడను గొప్ప విద్వాంసుడుండెను. ఇతను మంత్రకూట (మంథెన) శాసన రచయిత. అందొక శ్లోకముదాహరణకు-

శ్లో॥ పయోధివేలారశనా కలాపినీం
విధాయభూమి మవరోధభామినీం।
దుకూలశుభ్రై రకరోద్యశోభరై
ర్య ఏష తస్యా జవనీ తిరస్క్రియామ్॥

సముద్రపు చెలియలి కట్టయను వడ్డాణముగల యీ భూమిని తన యంతఃపుర భామినిగా జేసి దుకూల శుభ్రములైన యశస్సులతో నామెకు తెరచీర యొనర్చెను.

ఇవికాక శిథిల శాసనా లనేకముండును. వాటిలో నచ్చటచట కొన్ని రసస్ఫూర్తి నిచ్చు రచనలు గనుపించును. ఉదా:- (నందిగామ తాలూకా, అనుమంచిపల్లిలోని చాగి పోతరాజు శాసనము)

శ్లో॥ యస్మి న్న ర్థివిధేయసంపది దదత్యశ్రాంతవిశ్రాణనే
దద్యా దేష కదాచి దాత్మ భువనాధారం సువర్ణాచలం।
ఇత్థం చంద్రదివాకరౌ భయవశా త్పర్యాయవృత్యా చిరం
రక్షా జాగరణ ప్రదక్షిణ మవిశ్రాంతౌ పరిక్రామతః॥

(ద.భా.శా. 10—పుట 194)

నిరంతర దానగుణముగల యత డర్థివిధేయుడై యెప్పుడైనను తమ భువనమున కాధారమైన సువర్ణాచలమును గూడ దానమొసగగలడను భయముతో సూర్యచంద్రులు విశ్రాంతి లేకుండ నొకరువిడిచి యొకరు దానిని కాపాడుకొనుటకై జాగరణ చేయుచు ప్రదక్షిణము చేస్తున్నారుట.

ధర్మసాగరం శాసనంలో (వరం జి.శా. పుట-?26)

శ్లో॥ యశ్చప్రతాప జ్వలనస్య సన్నిధౌ
వసుంధరాయాః కరమగ్రహీద్రసాత్।
స తీవ కీర్తిః కకుబ న్త మన్వగాత్
సాపత్న్య వార్తాసహనా హి యోషితః॥

గణపతిదేవుడు ప్రతాపాగ్ని సన్నిధిలో రాజ్యలక్ష్మియం దనురాగముతో నామె కరగ్రహణము జేయుటతో కీర్తికాంత పతివ్రతవలె దిగంతములకు

బయలువెడలెను. ఈ విషయము నర్థాంతర న్యాసముతో సమర్థించుచున్నాడు. స్త్రీలు సవతుల వార్తను సహించరు గదా!

సాధారణముగ నన్ని శాసనాలకు ప్రార్థనగా ఆదివరాహమూర్తి, గజాస్యుడు అనేక విధములుగ స్తుతింపబడుచుందురు. అట్టి శాసన వరాహ మూర్తులను, శాసన గణపతులను రెండు స్తుతిమాలలుగ గూర్చవచ్చును.

గణపతిదేవుడు ఇంతటి విద్వదభిమానియనియే మనుమసిద్ధి రాజు రాచ కార్యమునకై తిక్కన సోమయాజిని పంపెను. తన యాస్థానమున ఒక కవి చక్రవర్తి, ఒక విద్యా చక్రవర్తి, ఒక అభినవ మయూరుడు, ఒక బాలభారతి, ఒక కవిసభాశిఖామణి, ఒక రాజగురుడు మరెందరెందరో పండిత కవివర్యు లలంకరించియుండగా నెల్లూరు నుండి కవిబ్రహ్మ తన సందర్శనార్థ మేతెంచినపు డా నృపశేఖరుడెంతగా మురిసిపోయెనో.

## 13. ఖండవల్లి శాసనము

శకము 1211; (క్రీ. శ. 1289-90)

ప్రతాపరుద్రుని కాలములో (క్రీ త. 1290-1323) శాసన రచయితలే గాక కొందరు గ్రంథ రచయితలు గూడ దెలియవచ్చుచున్నారు. వారిలో ప్రతాపరుద్రీయము (ప్రతాపరుద్ర యశోభూషణము) రచించిన విద్యానాథుడు; బాలభారతము, నలకీర్తికౌముది, కృష్ణ చరితమను గ్రంథములు రచించిన అగస్త్యుడు, ఉదాత్త రాఘవము, నిరోష్ఠ్య రామాయణము రచించిన శాకల్యమల్లన ముఖ్యులు.[1] ప్రతాపరుద్రుడు పండితపోషకుడే కాక స్వయముగ యయాతి చరిత్ర, ఉషారాగోదయము అను రెండు సంస్కృత నాటకములు రచించి భారత భారతికి, ఆంధ్రావని యందు రాజమర్యాదలు సైతము గావించిన విద్వన్నృపతి. ఈ రాజు కాలములోని కొన్ని సంస్కృత శాసనములు పరిశీలింతము. వీటిలో నిటీవల వెలువడిన ఖండవల్లి తామ్రపట్టికలు ముఖ్యమైనవి. (ఎపిగ్రాఫియా ఆంధ్రికా IV, పుటలు 103-119). ఈ శాసనము శకము

1. ప్రతాపరుద్రుని యాస్థానమున గుండయభట్టను విద్వాంసుడు శ్రీహర్షుని 'ఖండనఖండఖాద్యము'నకు వ్యాఖ్య రచించెను.

1211కు సరియగు క్రీ.శ. 1289 నాటిది. దీనిలోనే వేఱొండు భాగము శకము 1213కు సరియగు క్రీ.శ. 1292 నాటిది. కాకతీయ సామంతులలో నొకరు ఇందులూరి వంశమువారు. వీరు పశ్చిమగోదావరి మండలము నేలుచుండెడివారు. క్షత్రియులై కాకతీయ రాజ్యమును కాపాడుచు, ఆ రాజవంశముతో వివాహ బాంధవ్యము గూడ బడసిరి. శ్లోకవార్తికమునకు రాజరుద్రీయమను వ్యాఖ్య రచించిన కొలని రుద్రుడు ఈ వంశములోనివాడే. ఖండవల్లి శాసనము ఇందులూరి అన్నలదేవమంత్రి ఆ కాలమున ప్రఖ్యాత విద్వాంసుడని పొగడ్త నొందిన విద్దనాచార్యునికి[1] మర్పడిగ యను గ్రామము నగ్రహారముగ దానము చేసినట్లు తెలుపుచున్నది. ఆ విద్దనపండితుడు దానికి వినాయకపురమని నామమిడి, దాని యందు పలువురు విద్వాంసులకు భాగములు కల్పించెను. ఆ శాసనములోని రెండవ భాగము చాలుక్య రెండవ యిందుశేఖరుడు ఓనపల్లి యను గ్రామమును ఆ విద్దనాచార్యునికే దానమొసగినట్లు తెలుపును. ఈ శాసనములో రసస్ఫోరకము లగు శ్లోకములు కొన్ని గలవు. కవిపేరు చెప్పబడలేదు కాని దీనిని విద్దనాచార్యుడే స్వయముగ రచించి యుండును లేదా ఆ పండితుని యొద్దనుండు మఱి యేవిద్వాంసుడైనను గావచ్చును.

మొదట విఘ్నేశ్వర ప్రార్థన-

శ్లో॥ దేవః స్తంబే రమాస్యః కరశిఖరపయః శీకరైః స్తావకీనం
చేత శ్శీతం విధత్తాం దళయతు తిమిరం దన్తరేఖా మయూఖైః।
దూరే ధూనోతు విఘ్నప్రకర మనుకలం వ్యగ్రకర్ణాగ్రవాతై
శ్చూడా సిందూర ధూళీ వితతిభి రవతా ద్ధర్మ కర్మానురాగమ్॥

గజాననుడు కరాగ్రమునుండి వచ్చు నీటితుంపరలతో మనస్సును శీతలము చేయుగాక, దన్తరేఖా కిరణములతో అజ్ఞానాంధకారము బోగొట్టుగాక, విరామము లేకుండ కదలించుచుండు చెవుల చివరి నుండివచ్చు గాలులతో విఘ్నములను

1. ఇటీవల బయల్పడిన ఉత్తరేశ్వర తామ్రపట్టికల శాసనమునుబట్టి విద్దనాచార్యుడను నొక గొప్ప విద్వాంసు డాకాలమున గలడని, అతను ప్రమేయ చర్చామృతమను నొక యుద్గ్రంథమును రచించెనని యందు గలదు. ఇది యొక శాస్త్ర గ్రంథము. ప్రస్తుతము లభ్యమగుట లేదు.

దూరముగ తొలగించుగాక, శిరసునందున్న సిందూర ధూళితో ధర్మకర్మలయం దనురక్తిని కాపాడుగాక. పయశ్శీకరములకు చల్లబరచుట, తెల్లని దంత కాంతులకు తిమిరము బోగొట్టుట, గాలు కు విఘ్నముల నెగురగొట్టుట, ఎఱ్ఱని సిందూర ధూళికి ధర్మకర్మానురాగమును కాపాడుట యను విశేషములు జెప్పబడెను.

రెండవ శ్లోకములో మహిషమర్దిని జెప్పబడెను.

శ్లో॥ మాద్యన్తం మహిషాసురం గిరినిభం న్యక్కృత్య వామాంఘ్రిణా
మా భూత్కంప ఇతీవ దక్షిణపదా సంభావయన్తీ భువం।
ఆశా స్వష్టసు రక్షితుం కిల జగద్బాహాష్టకం బిభ్రతీ
సా శక్తి ర్నిటలాక్ష నిష్ఠుర రుచా యుష్మద్రిపూ న్పశ్యతు॥

ఎడమ పాదముతో మదించిన మహిషాసురుని త్రొక్కిపెట్టి, అందువలన భూమి చలించునను అనుమానముతో కుడిపాదమును భూమిపై మోపి, తన యెనిమిది బాహువులను నెనిమి దిక్కులను రక్షించుటకై చాచినదివలెనున్న ఆ దేవి తన నిటలాక్ష నిష్ఠురకాంతితో మీ శత్రువుల జూచుగాక!

వరాహ రూపియగు విష్ణువును—

శ్లో॥ అనుపద మవధూన్వ న్దంష్ట్రియా దైత్యవంశా
నుపనిషదటవీనా మంతరే సంచరిష్ణుః।
నియమవిదచలానా మంతరాక్రాన్తి శాలీ
ప్రథమకిరి రజస్రం పాతుదేవీం ధరిత్రీమ్॥

దైత్యవంశములను తన కోరతో మాటమాటికి త్రోసివేయుచు, ఉపనిషత్తు లనెడి అడవులలో చరించుచు, ధర్మవిదు లనెడి పర్వతముల మధ్య వ్యాపించియుండు స్వభావముగల ఆదివరాహము భూదేవి నెల్లపుడు రక్షించుగాక! ఇచట వరాహ గుణములగు, కోరలతో అనిష్ట పదార్థమును విదళించుట, అడవిలో సంచరించుట, కొండల మధ్య దిరుగుట యను విషయములు జెప్పుచు ఉపనిషత్తులను అడవులుగాను, ధర్మవిదులను కొండలుగాను (రూపకములు) జెప్పెను.

ఈశ్వరుని శిరోభూషణమైన చంద్రుని స్తుతించును—

శ్లో॥ శరాన్ముక్త్వా పంచాఽప్య ఫలితరుషా చిత్తజనుషా
పరిక్షిప్తం పౌష్పం ధనురివ కిరీటే స్మరధుషః।
కలా యస్య స్ఫూర్తిం భజతి రజనీశశ్చ భవతాం
ప్రసాద ప్రత్యూహం విఘటయతు తామిస్రపటలమ్॥

ఎవని కళ స్మరహరుని కిరీటముపైన, అయిదు బాణములు ప్రయోగించినను ఫలము లేకుండ వ్యర్థమైన కోపముగల మన్మథునిచేత (విసుగెత్తి) పాఱవేయ బడిన పుష్పధనుస్సువలె దోచుచున్నదో అట్టి చంద్రుడు మీ యొక్క (అదృష్ట రూప) ప్రసాదమునకు విఘ్నమగు (పాపరూప) తామిస్రమును బోగొట్టుగాక! ఈశ్వరుని శిరోభూషణమైన చంద్రకళను విఫలుడైన మన్మథుడు విసుగెత్తి పాఱవేసిన పుష్పధనుస్సుతో నుత్ప్రేక్షించెను.

తరువాత బ్రహ్మసృష్టిలో భూలోకము, అందు ఆంధ్రదేశము, గౌతమీనది, శ్రీపర్వము జెప్పబడెను. ఆ పైన ఓరుగల్లు నగరమును వర్ణించును-

శ్లో॥ ఓరుగల్లు నగరం విరాజతే
తత్ర గోపురకరాంచితాంబరం।
దేవతా భవన భవ్య భేరికా
రావరాజితవిమాన గహ్వరమ్॥

ఆంధ్రదేశమున, గోపురములనెడి కరములతో ఆకసమునందు వ్యాపించి మంగళభేరుల ధ్వనులతో నిండిన దేవతాభవనముల విమానములతో క్రిక్కిరిసి యుండు ఓరుగల్లు నగరము శోభిల్లుచుండును.

శ్లో॥ శీతాతపాసార సహశ్చిరంయత్
ప్రాసాద పాలీషు సువర్ణ కుంభాః।
ఆలంబ్య విష్ణోః పద మంగనానా
మురోజ సామ్యాయ తపశ్చరన్తి॥

అచటి ప్రాసాదముల అంచులపై నలంకారముగ నుంచబడిన సువర్ణకుంభములు చలి, యెండ, వాన అనకుండగ ఆకసమును (విష్ణు పదమును) ఆశ్రయించి నిశ్చలముగ నుండుటను కవి యుత్ప్రేక్షించును. జడభావము పోగొట్టుకొని (అచటి) అంగనల ఉరోజములతో సామ్యము తమకు లభించుటకై యట్టి కఠినమగు తపస్సమాధి నాచరించుచున్నవి వలె నున్నవి. ప్రాసాదములపై సువర్ణ కుంభముల నలంకరించుకొనునంతటి శ్రీమంతు లచట గలరని వ్యంగ్యము.

మఱియొక వర్ణన—

శ్లో॥ బాలాతపాయత్ర బలాధిపానాం
యచ్ఛన్తి హర్మ్యాణి గవాక్షమార్గైః ।
భవత్ప్రతాపా స్తిరయన్తు నాస్మా
నితీవ సేవాముపగన్తు కామాః ॥

ఎచటి సైన్యాధిపతుల భవన్తులలోనికి గవాక్షములనుండి లేతయెండ 'మీ ప్రతాపములు మమ్ముల నడ్డగించలే' వని చెప్పుచు వానిని సేవించుటకువలె లోనికి పోవుచుండునో అని అచటి బలాధిపులు సూర్యుని కంటెను నధిక ప్రతాపముగలిగి బాలాతపముచేత తమ హర్మ్యములందు సేవించబడుచుందురని వ్యంగ్యము.

అచటి విద్వాంసుల గూర్చి—

శ్లో॥ దేశాంతరా దాగమినః పుమాంస
స్సర్వాసు విద్యాస్వపి సారభాజః ।
శాస్త్రార్థ సన్దేహనిరాస రీతిం
యస్మిన్ లభన్తే శుకసారికాభ్యః ॥

ఎచట, సమస్త విద్యలు నేర్చిన దేశాంతరములనుండి వచ్చు విద్వాంసులు గూడ శుక సారికలనుండి తమకుగల శాస్త్రార్థ సందేహముల దీర్చుకొనుచుందురో యని యచటి విద్వాంసుల విద్యుత్కర్షను, వారిండ్లలోనుండు శుకసారికములు గూడ శాస్త్రార్థప్రావీణ్యము గలవని అతిశయోక్తిగ వర్ణించెను.

ఓరుగల్లు నగర వర్ణన గణపతిదేవుని కాలంనాటి మొగలుట్ల శాసనంలో (ఎ.పి. ఆం. iv-99) ఇట్లు వర్ణంచబడెను.

శ్లో॥ ఓర్గల్లిత్యథ పట్టనం ప్రకటిత ప్రాసాద మాసాదిత
శ్రీవిష్ఫారిత మస్తి విస్తృతగుణై ర్విద్వద్భి రుద్భాసితం ।
యత్సౌధోజ్జ్వల నూత్నరత్నరుచిభి శ్ఛన్నేఽంబరేఽహర్నిశం
వ్యక్తి ర్వ్యక్త వియుక్త చక్రమిథునై ర్నిర్వ్యాజ మున్నీయతే ॥

ఓరుగల్లు గొప్పగా కనిపించు ప్రాసాదముల శోభగలదై గుణసంపన్నులగు విద్వాంసులచే నలంకరింపబడియుండును, ఎచటి సౌధములలోని నూతన రత్న కాంతులచేత ఆకాసము రేయింబవళ్లు నిండియుండగా నేది పగలో యేదిరాత్రియో తెలిసికొనుట చక్రవాకపక్షుల యోగ వియోగములచేతనే స్పష్టమగుచుండునో, చక్రవాక మిథునములు పగటి వేళలయందు కలిసియుండుట, రాత్రులందు విడిపోవుట ప్రసిద్ధము. అతిశయోక్తి.

ఆ మొగలుట్ల శాసనములోనే మఱియొక వర్ణన-

శ్లో॥ యస్మిన్ హర్మ్య సముల్లసన్మరకత ప్రోద్యత్ప్రభామండలై
ర్దూర్వాకోమల కాంతిభి స్తతఇతో వ్యాప్తం విలోక్యాంబరం ।
సూర్యాశ్వా శ్చిరయంతి నూతన తృణభ్రాంత్యేతి సంతాపిని
గ్రీష్మే యత్తదహః ప్రవృత్తి రుచితం నిశ్చీయతే పండితైః ॥

అచటి హర్మ్యములందుండు మరకత మణుల ప్రభామండలముల చేత నాకసము లేతపచ్చికతో వ్యాప్తమై యున్నట్లుండుట చూచి సూర్యుని యొక్క అశ్వములు పచ్చిగడ్డిదొరకని గ్రీష్మము (వేసవి) లో ఆ మరకతమణుల కాంతినే పచ్చిక యని భ్రమించి (దృష్టినటువైపుంచి) నెమ్మదిగా పోవుచుండుటవలన ఆ కాలము నందు (వేసవిలో) పగళ్లు దీర్ఘములై యుండునని పండితులు నిశ్చయించి చెప్పుదురు. అతిశయోక్తి, భ్రాంతి.

కుందవరం శాసనంలో ఓరుగల్లు వర్ణన-

శ్లో॥ తస్యా సీద్రాజధానీ సురపురజయినీ రుద్రదేవావనీశ
స్యోరుంగల్చారు విద్యాస్ఫురిత గురుశతానేక నాగాశ్వపూర్ణా ।
యత్రా మిత్రావనీభృ త్పురవరసమితి స్సోమసూర్యాఖ్యవీథీ
వాటీభూత ప్రభూత స్ఫుటవసతి రభూ త్పూర్వనామోత్కరేణ ॥

5)

ఆ రుద్రదేవునికి సురపురము (అమరావతి) ను జయించు ఓరుంగల్లు రాజధాని. సురపురములో నొకే గురువు, ఒకే ఐరావతమను గజము, ఒకే యుచ్చైశ్శ్రవమను అశ్వము గలవు. కాని యిచట విద్యావంతులగు ననేక గురువులు, అనేక నాగములు, అనేకాశ్వములు గలవు.

రుద్రుడు శత్రుపురములనేకము కొల్లగొట్టి అయా పేర్లతోనే ఓరుగల్లులో తూర్పు-పడమర; ఉత్తర - దక్షిణములు వ్యాపించు సూర్య-సోమ వీథుల నిర్మించి యచటి పరాజితులనే యందు కాపురముంచెను. వరంగల్లులోని పాను గంటివాడ తాను కొల్లగొట్టిన చోడుల నల్లగొండ దగ్గరి పానుగల్లును బట్టి నిర్మించినదే.

ఖండవల్లి శాసనములో ప్రోలరాజును గూర్చి-

శ్లో॥ యశాంసి యస్య స్ఫుట ముల్లసన్తి
త్రిలోకనీలోత్పల లోచనానాం ।
కంఠేషు కర్ణేషు పయోధరేషు
హారన్తి హీరన్త్యపి చన్దనన్తి ॥

ఎవని యశస్సులు త్రిలోకసుందరీల కంఠములందు హారములుగను కర్ణములందు మణులుగను, పయోధరములపై జన్దనముగను స్ఫుటముగ శోభిల్లుచున్నవో, ఆచారక్రియంతమాలా రూపకము. [1]

రుద్రదేవుని గూర్చి-

శ్లో॥ సరుద్రదేవం తనయం తమూర్వీం
కాలక్రమా త్పాలయితుం దిదేశ ।
యస్యప్రతాపేన హుతాశనేన
ప్లుష్టం నభోనూన ముపైతి నైల్యమ్ ॥

1. ఇట్టిదే నరసభూపాలీయములో నుదహరించబడెను (పం. 44).
కం. హరశిఖరిదరుల భాషా, తరుణీకుచగిరుల నమరతరులం జెలగున్
ఝురులై సరులై విరులై, నరనుతమగు నీదు కీర్తి నరసింహనృపా.

ఆ ప్రోలరాజు కాలము గడచిన పిదప కుమారుడైన రుద్రదేవుని రాజ్యపాలనకై యాదేశించును, ఎవని ప్రతాపాగ్ని చేత వ్యాపించబడి ఆకసము నల్లగనున్నదో.

మఱియొకటి—

శ్లో॥ యస్యారి భూపాల విలాసినీభ్యః
శ్వాసానిలో త్తై ర్వనవాసినీభ్యః
లావణ్యభిక్షా ముపగన్తు మేవ
ప్రవాల హస్తై ర్లతికా యతన్తే ॥

ఎవని శత్రురాజుల విలాసినులు వనవాసము జేయుచుండగా వారి శ్వాసానిలముల చేత పైకి లేచిన చిగురుటాకులనెడి హస్తములతో నచటి చిన్నలతలు వారినుండి లావణ్యభిక్ష పొందుటకొఱకే యన్నట్లున్నవో.

వానికీర్తిని వర్ణించుచు—

శ్లో॥ యత్కీర్తి సారంగవిలోచనాయాః
దిగ్భి స్సఖీభిః పరివారత్యాః।
మన్యేఘనానాం పథి లోలమానం
క్రీడాకరం కందుక మిందుబింబమ్ ॥

దిక్కులనెడి సఖీజనముగల వానికీర్తికాంతకు ఆకసములో తిరుగుచున్న చంద్రబింబము క్రీడాకందుకముగ దోచుచున్నదని యుత్ప్రేక్షించెను.

రుద్రుని యనంతరము మహాదేవుడు రాజయ్యెనని చక్కని భావముతో జెప్పును.

శ్లో॥ అసౌ మహాదేవ ఇతిశ్రుతాయ
కనీయసే ఖండితవైరి వర్గః।
దదౌ ధరిత్రీ వలయాధిపత్యం
కీర్త్యైవ రన్తుం కిలరక్త చేతాః ॥

ఈ రుద్రదేవమహారాజు కీర్తికాంతయెడ మాత్రమే అనురాగము కలవాడై యీ భూవలయాధిపత్యమును తన తమ్ముడగు మహాదేవుని కిచ్చెను.

ఈ మహాదేవుడు యాదవరాజుల రాజధానిపై దండెత్తుట నిట్లు వర్ణించును.

శ్లో॥ పరిమ్లాన యశః పుష్పాం స్రస్త ప్రాకారమేఖలాం ।
సకదాచి దరాతీయాం చక్రే కామాకులాం పురీమ్ ॥

వాడిన యశస్సనెడి పుష్పములు గలదానినిగను, జారిపోయిన ప్రాకారమనెడి మేఖల (ఒడ్డాణము) గలదానినిగను, ఒకప్పుడాతడు శత్రుపురి (యనెడి స్త్రీని) కామాకులమైన దానినిగ జేసెను.

అతడు యుద్ధములో జనిపోవుటను—

శ్లో॥ కుంభయో స్సకరీంద్రస్య జయశ్రీ కుచయోరివ ।
సంవివేశ రణే రాత్రౌ రక్తచందన చర్చితః ॥

జయశ్రీ కుచములపైవలె కరీంద్ర కుంభములపై రాత్రి రణమందు రక్తమనెడి చందనము పూయబడి నిద్రించెను.

గణపతిదేవుని గూర్చి—

శ్లో॥ తతో గణపతి స్తస్య దానశ్రీనిలయ స్సుతః ।
దధార రత్నధామాంకం కరేణ వలయం భువః ॥

గణపతిదేవునితో కాకతి గణపతిరాజును శ్లేషపదములతో బోల్చెను. ఇద్దరు దానశ్రీనిలయులు; కరమనగా తొండము, భుజము; ఇద్దరు మహాదేవుని సుతులు; రత్నభూషితవలయము నొకరు, రత్నగర్భయగు భూవలయము నొకరు ధరించుచుండిరి.

శ్లో॥ యత్పాదపీఠ పర్యన్తం కుట్మలీకృతపాణయః ।
నీరాజయన్తి రాజాన శ్చూడామణి మరీచిభిః ॥

ఎవని పాదపీఠము యొక్క అంచులుదాకునట్లు ముకుళిత హస్తములందు తమ చూడామణుల కాంతులనుంచుకొని నీరాజన మొసగు చుందురో. గణపతిదేవుని పాదపీఠము వద్ద వారు శిరములు మోడ్చి శరణువేడిరనుటలో వారి శిరోమణుల కాంతులతో నీరాజనమిచ్చినట్లు ప్రయోజనము జెప్పబడెను. పరిణామాలంకారము.

శ్లో॥ యస్య ప్రతీపక్షితిభృత్కులానాం
కిరీట సంఘట్టనయా స శంపా।
నిపీతవారి స్తరవారియష్టి
ర్ధారాధరత్వం ప్రకటీచకార॥

గణపతిదేవుని కత్తి శత్రుక్షితీశుల కిరీటములతోటి సంఘట్టనమువలన మెఱుపువలె జ్వాలకలదై, త్రాగిన నీరుకలదై (రక్తము త్రాగినదై?) ధారాధరత్వము (పదను కలిగియుండుట)ను ప్రకటించెను. (మెఱుపు కలిగియుండుట, నీరు త్రాగుట మేఘలక్షము)

రుద్రమదేవిని గూర్చి-

శ్లో॥ యస్యా వితీర్ణం కిల చిన్తయన్తీ
చిన్తామణిః స్థావరతాం జగామ।
యస్యా యశస్సామ్య మనాశ్రయన్తీ
ధేనుశ్చ దివ్యా సురభి ర్బభూవ॥

ఆమె యొక్క దానమును జూచి చిన్తామణి స్థావరమయ్యెను; ఆమె కీర్తితో సరి తూగలేక కామధేనువు సురభిజంతువుగ నుండెను.

ప్రతాపరుద్రునిగూర్చి-

శ్లో॥ భాగ్యేన సార్ధం పరివర్ధమానః
స ప్రాప్య రాజ్యం జననీజనన్యాః।
ఆరా దరాతీన్ క్రథయన్ ప్రతాపా
దాప్నో త్ప్రతాపాదిమ మాత్మనామ॥

జననీజనని (ముమ్మడమ్మ తల్లియైన రుద్రమదేవి) యొక్క రాజ్యము పొందినవాడై, తన ప్రతాపమువలన శత్రువులను దూరము నుండియే చంపుచు, ప్రతాప పద మాదియందుగల పేరుగలవాడయ్యెను. రాజ్యమామె నుండి పొందినను పేరు మాత్రము స్వప్రయోజకత్వముతో సంపాదించినదేనని భావము.

శ్లో॥ యస్మి న్మహీం శాసతి నైవ చౌర్యం
న దైన్యవృత్తి ర్నపరాపవాదః।
నా సత్యభాషా భవతి ప్రజానాం
కులక్రమాచారకుతూహలానామ్॥

శ్లో॥ యదీయ రాజ్యేసతి మాసిమాసి
వారత్రయం వర్షతి వారివాహః।
జనా నిరాతంక నిరీతిశంకా
భవన్తి సస్యాని చయన్తి బుద్ధిమ్॥

శ్లో॥ కీర్తి ర్యదీయా లులితాంబరశ్రీః
పయోధర స్ఫూర్తి మదర్శయన్తీ।
నక్షత్ర మాలా భరణం వహన్తీ
బిభర్తి భవ్యం సుమనోవికాసమ్॥

## 14. గోరవంకపల్లి శాసనము

శకము 1214; (క్రీ. శ. 1292-3);
ఆం. ప్ర. మ్యూజియం తామ్రశాసనాలు-I, పుట 106.

ప్రతాపరుద్రదేవుని సేనాపతులలో చెరకు బొల్లయరెడ్డి కొడుకు రాజ రుద్రుడు గోరవంకపల్లి గ్రామమును దానముచేయుచు నొక తామ్రపట్టికా శాసన మొసగెను. అందు ప్రశస్తి భాగము చక్కని పదలాలిత్యముతో మనోజ్ఞమై యుండును. అందుండి కొన్ని శ్లోకము లుదహరించబడును. కవిపేరు తెలియదు.

గణపతి దేవుని గూర్చి —

శ్లో॥ అథ సకలమహీభృన్మ స్తకన్య స్తపాదః
పరిచితవియదాశ స్సద్యశ శ్చన్ద్రికాభిః।
అధిగతజని రస్మా చ్చౌర్యగాంభీర్యసింధో
ర్గణపతి రితి రాజా రంజయామాస పృథ్వీమ్॥

శ్లో॥ సామ్రాజ్య సింహాసన మత్యుదగ్రం
యస్మి న్నమారోహతి రాజసింహే।
ఆరోహతి స్మాస్య విదూరభాజాం
తదైవ రాజ్ఞామపి మౌళిమాజ్ఞా॥

గణపతిదేవుడు సింహాసనముపై నెక్కుట, ఇతర రాజుల శిరములపై వాని ఆజ్ఞ యెక్కుట రెండును తుల్యయోగములు.

రుద్రమదేవిని గూర్చి-

శ్లో॥ మంథాచల వ్యాకులితస్య సింధో
రపత్యతాదోష మపాచికీర్షుః।
అక్షోభ్యసత్వా దుదియాయ తస్మా
ద్రుద్రాంబికేతి ప్రథయా స్వయంశ్రీః॥

పూర్వము మంథాచలముచేత వ్యాకుల పెట్టబడిన సముద్రమునకు పుట్టిన దోషమును బోగొట్టుకొనుటకై యిపుడేవిధముగను క్షోభపెట్టబడలేని సత్వముగల ఆ గణపతిదేవునికి రుద్రాంబికయను పేరుతో సాక్షాత్తు లక్ష్మియే యుద్భవించెను. సముద్రునికంటె గణపతికి అధిక్యము జెప్పి రుద్రాంబ స్వయంగా లక్ష్మీదేవియే యని వ్యతిరేకము.

ప్రతాపరుద్రదేవునిగూర్చి-

శ్లో॥ తస్యా స్తనూజాతనయో నయజ్ఞః
ప్రతాపరుద్రః ప్రథమాన భద్రః।
చతుస్సముద్రావలయాం ప్రశాస్తి
విశ్వంభరాం విస్మయనీయ భూమా॥

శ్లో॥ యస్మి న్మహీం శాసతి యామినీషు
దోషాహ్వయః పాథసి భంగసంగః।
ద్విజాధిరాజే ప్రతిపక్షబాధో
గ్రాహోః పునర్న క్వచన ప్రజాసు॥

ఆ రాజు పాలించుచుండగా, దోషసంజ్ఞ రాత్రులందు, ప్రజలలో దోషము లేదు. భంగసంగము (అలలుండుట) సముద్రమునందు కాని ప్రజలలో భంగ పాటు (అవమానము) లేదు, ప్రతికృష్ణ పక్షమున, రాహువువలన బాధ చంద్రు నికే కాని, ప్రజలకు శత్రుబాధగాని, రాహుగ్రహబాధగాని లేదు. శ్లేషతో గూడిన అర్థాపత్తి.

వారి సామంత వంశమున చేరకు బొల్లయను గూర్చి-

శ్లో॥ తేషా మభూ దద్భుతవిక్రమాణా
మగ్రేసరో బొల్లయనామధేయః ॥
యఃస్వామి భక్త్యా శివపాద భక్త్యా
ప్రాప్తః ప్రసిద్ధిం మహతీం మహీంచ ॥

వారిలో విక్రమ ప్రదర్శనావసరములందు అగ్రేసరుడగు బొల్లయ స్వామి భక్తుడై ప్రసిద్ధిని, శివపాదభక్తివలన గొప్ప భూమిని పొందెనని క్రమా న్వయము. ఐశ్వర్య ప్రదాత యీశ్వరుడు గనుక మండలాధిపతియగుటలో స్వామియనుగ్రహమున్నను ఈశ్వరానుగ్రహము అవశ్యముండవలెను.

ఈ బొల్లయ మనుమడు వేలూరి యిమ్మడి బొల్లయను గూర్చి-

శ్లో॥ వేలూరి బొల్లప్రభు రస్యజాత స్సూను స్సదంభోజ వికాస భానుః
యస్యప్రతాపేన విజృంభితేన నవర్ధితః శత్రుయశశ్శశాంకః॥

సజ్జనులనెడి పద్మముల వికసింపజేయు భానుడగు నితని ప్రతాపము విజృంభించగా శత్రుయశస్సనెడి చంద్రుని గూర్చి చెప్పుటయే లేదు రూపకము.

ఇతనిని గూర్చి మఱియొక విధముగ—

శ్లో॥ దానై ర్మహద్భి స్సకలద్విజానాం
సంపన్నిదానైః ప్రథిత ప్రభావః।
అపారిజాతోఽపి యశఃప్రసూనై
ర్యః పారిజాతస్య సమానధర్మా॥

దానములతోను, సంపన్నిదానములతోను అపారిజాతుడైనను (పారిజాత వృక్షముగాకున్నను. అప + అరిజాతము = పోగొట్టబడిన శత్రువులు గలవాడని శ్లేష) యశః ప్రసూనములతో పారిజాతవృక్షము (దేవతరువు) తో సమాన ధర్మము గలవాడయ్యెను- శ్లేషానుప్రాణిత విరోధము.

వేలూరి యిమ్మడి బొల్లయ కొడుకు రాజరుద్రుడు దానకర్త, అతనిని గూర్చి-

శ్లో॥ యస్య ప్రతాపప్రసరా దతీవ
సంతాపితానాం రిపునాయకానాం
నాన్యాగతి ర్యత్పద కల్పవృక్ష
చ్ఛాయాతతే స్సంశ్రయ మంతరేణ ॥

ఎవని ప్రతాపము ప్రసరించుట వలన సంతాపము జెందెడి శత్రునాయకులకు వాని పాదములనెడి కల్పవృక్షచ్ఛాయ నాశ్రయించుట విడిచి వేఱొండు గతి లేదో; వానిచే నోడింపబడిన శత్రువులు వాని పాదము లాశ్రయించి శరణు వేడుకొనుట గాని లేదా వానిచే జంపబడి స్వర్గమునకేగి కల్పవృక్షచ్ఛాయ నాశ్రయించి విశ్రమించుటగాని తప్పదు. వాని పాదములు కల్పవృక్షమువంటి వని రూపకము.

అతని వితరణ గుణమును గూర్చి-

శ్లో॥ యదీయ విశ్రాణనవారి సేకా
ద్వివర్ధమానా వసుధాలవాలే ।
వివేల్లి శాఖా విటపా విహాయ
స్తరుం సమారోహతి కీర్తివల్లీ ॥

ఎవని దానవారి (దాన మొనర్చునపుడు విడుచు జలము) తో భూమియను పాదులో పెంచబడుచు, దిక్కులనెడి చెట్టును చుట్టుకొనిన కీర్తిలత ఆకాశమనెడి తరువుపై కెక్కుచున్నదో. 'విహాయ స్తరు' వనుపదము నాకలోక తరువగు కల్పవృక్షమును స్ఫురింపజేయుచు దాన విషయమునందతని కీర్తి కల్పతరువును గూడ నధిగమించుచున్నదని విశేషార్థము వ్యంగ్యము.

పేరు చెప్పుకొనని యీ శాసన రచయిత చక్కని యలంకారములతో ద్రాక్షాపాకములో నతిమధురముగా నీప్రశస్తిని రచించెను.

## 15. నరసింహర్షి -[సిద్ధోద్వాహము]

కాకతి ప్రతాప రుద్రుని కాలములో శాసనములందు ప్రాసంగికముగ రచించిన ప్రశస్తులు, తటాక దేవాలయాది వర్ణనలు గాక ప్రత్యేకించి కావ్యములుగ రచింపబడి శిలలపై చెక్కబడియున్న కావ్యములు రెండిటివల కనుగొనబడెను. ఇట్లు శిలలపై కావ్యములు మలచబడుట చాల యరుదు. ఓరుగల్లు కోటకు సమీపమున ఉర్సు అనబడు నొక పల్లెకు వెలుపల గుట్టపైన ఈ శాసనములు మలచబడెను. అందొకటి అసంపూర్తిగ విడువబడెను. ఉన్న కొద్ది భాగమైనను నీటి జాలొకటి దీని పై నుండి యెల్లపుడు పోవుచుండుటవలన దట్టముగు పాచి పట్టి నిరుపయోగ మయ్యెను. దాని ప్రథమ సర్గాంతమున

'ఇతి రాజగురు విశ్వేశ్వరసూనో ర్నరసింహర్షేఃకృతౌ యోగ......తే

ప్రథమస్సర్గః' అని చదువుటకు వీలగుచున్నది. గ్రంథము పేరుకూడ తెలియుటలేదు కాని దీనిని గణపతిదేవునికి, రుద్రమ దేవికి రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యుని కొడుకగు నరసింహర్షి రచించెనని మాత్రము స్పష్టముగ తెలియుచున్నది. కొడుకనగా నౌరసపుత్రుడో లేక విద్యా సంతతిలోని శిష్యుడో చెప్పజాలము. నరసింహర్షియను విద్వాంసుడు అప్పట్లో కలడనుటకు వేఱు నిదర్శనములు కూడ గలవు. కాని అతడు రాజగురు విశ్వేశ్వర శివాచార్యుని సంతతి యని మాత్రమిందు మూలముననే తెలియుచున్నది. అతనిని గూర్చిన నిదర్శనాంతరములు — (ఎ పి. ఇండికా 38, పు 202-215)

1. కోటలో నేకశిలయనబడు కొండపైన ఈ శ్లోకము గలదు.

(వరం. జి. శా. పుట 255)

శ్లో॥ అవ్యా దుర్వీ ముదధిరశనా మగ్రణీః కాకతీనాం  
విద్యాశాలీ విదితవినయో వీరరుద్రాభిధానః ।  
యాత్రాకారే విజితహరితో యస్య సేనాగజానాం  
మధ్యే కశ్చి న్మలయశిఖరీ మాల్యవా న్మందరోవా ॥  
నృసింహర్షిః ॥

కాకతీయులలో శ్రేష్ఠుడగు వీరరుద్రుడు (ప్రతాపరుద్రుడు) విద్యాశాలియు వినయశాలియునై సముద్ర రశనయగు నీభూమిని రక్షించుగాక (పాలించుగాక), అని ఆశీర్వాదము చెప్పుచు, వాని సేనాగజముల యౌన్నత్యమును మలయ శిఖరితోను మాల్యవంతనుతోను బోల్చును. తుదిలో రచయిత పేరు 'నృసింహర్షి' యని కూడ కలదు. దీనినిబట్టి రుద్రమదేవికి రాజగురువైన విశ్వేశ్వర శివా చార్యుని కొడుకగు నరసింహర్షియు ప్రతాపరుద్రుని సమకాలికుడనదగిన యీ శ్లోకము క్రింద బేర్కొనబడిన నృసింహర్షియు నొక్కరేయని చెప్పవచ్చును. పాశుపత శైవాచార్యులు శివ, శంభు, పండిత, ఋషి మున్నగు పదములను తమ పేర్ల చివర పెట్టుకొనువారు.

ఈ నృసింహర్షియొక్క వైదుష్యము దెలుపు కొన్ని శిలాక్షరము లితరత్ర కానవచ్చును. కోటలో తోరణద్వారములనబడు పెద్ద శిలాద్వారములలో నొక దానిపైన-

శ్లో॥ ఋక్పాయా రచితా నిరర్గళగిరా యేనాధికశ్రేయసీ
శాస్త్రగ్రన్థకృతా నృసింహ కృతినా హృద్యగ్రన్థి గంధచ్ఛిదా।
అస్మిన్నేకేన హి కాకతీయ చరితేతేనాష్ట శిష్టాదృతాః
కాష్ఠాఘాట విసర్గ నిర్గత యశఃసర్గేణ సర్గాఃకృతాః॥

నృసింహకృతిచేత ఋక్పాయ (ఋగ్వేదమునకు లఘువ్యాఖ్య కావచ్చును), మఱి కొన్ని శాస్త్రగ్రన్థములు రచింపబడెను. వానిచేత కాకతీయ చరిత్రలో నెనిమిది సర్గలు శిష్టులచే నాదరింప యోగ్యమై యొకే దినములో రచింపబడెను. తను దిగంతములు వ్యాపించిన కీర్తిగలవాడట. ఈతనిచే రచింపబడిన ఋక్పాయగాని కాకతీయ చరిత్రముగాని, యితర శాస్త్రగ్రన్థములు గాని ప్రస్తుత మేవియు లభించుట లేదు.

తన యొక్క గొప్పతనమును వేఱొందు తోరణస్తంభముపై నిట్లు వ్రాయించుకొనెను.

ఆర్యా॥ అప్రాప్త సభాస్తంభో ప్యవిపన్న హిరణ్యకశిపు రపి।
అవికృతముఖో పి దశసు ప్రగల్భతే రూపకేషు నరసింహః॥

ఇందు విష్ణువు యొక్క నరసింహావతారముతో తనను బోల్చుకొనును. అవతార నరసింహుడు సభా స్తంభములో నుండెను, తాను విద్వత్సభలో స్తంభమువలె జడుడై యుండుటగాని స్తంభము చాటుగ దాగియుండుటగాని లేనివాడు; అవతార నరసింహదేవుడు హిరణ్యకశిపుని చంపినవాడు, తను హిరణ్యము, వస్త్రములు తలుగవట్టినవాడు; నరసింహదేవుడు వికృతముఖము కలవాడు, తను అట్టి ముఖవైలక్షణ్యములు జూపని వాడు; ఇంత శ్రమపడి కాని విష్ణువు పది రూపములు పూర్తిజేసికొనలేకపోయెను. తానట్టి శ్రమ లేకుండగానే పది రూపకములందు ప్రగల్భుడయ్యెను. దీనినిబట్టి నరసింహుడు దశవిధ రూపకములు గూడ రచించెనని తెలియుచున్నది. కాని వాటిలో నెద్దియు కానరాదు. శాస్త్రములందు ప్రావీణ్యమే కాక గ్రంథకర్తయు కవియునై యితడు ప్రతాపరుద్రుని యాస్థానమున విరాజిల్లెను. ఈ విద్వత్కవి రచనలేవియు మనకు లభించకుండుట విచారకరము. అతనిచే రచింపబడిన ఒక్క లఘు కావ్యము మాత్రము లభించుచున్నది. పైనుదివిన ఉరుసుగుట్ట పైనున్న అసంపూర్తియు నిరుపయోగమైన శిలాగ్రంథముతోబాటు ఆ గుట్ట పైననే వేఱొండు ప్రక్కనే ఒక కావ్యము మలచబడెను. అందు ౬౨ శ్లోకములుగలవు తుదిలో 'విశ్వేశ్వర సూనోర్నరసింహార్యేః కృతిః' అని కలదు. కనుక నిదిపై జెప్పిన విద్వత్కవియగు నరసింహార్యి యొక్క రచనయని నిర్ధారించవచ్చును. కావ్యము పేరు చెప్పబడలేదు. కథా వస్తువును బురస్కరించుకొని యీ శాసన కావ్యమును ప్రకటించునపుడు 'సిద్ధోద్వాహ' మను పేరుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖలో 1968 లో ప్రకటించితిని.

ఈ చిన్న కావ్యమునకు ప్రస్తుతము శిలాక్షరములుదక్క వేఱొండు మాతృక యింతవరకు లభించలేదు.

కథా వస్తువు కల్పితము. మన గాథా వాఙ్మయమున దీనికి ఆధార మనదగిన దానిని నేనింతవఱకు గుర్తించలేకుంటిని.

ఒకానొక నూతన సిద్ధదంపతు లొకనాడు గంగా సైకతముపై విహరించుచుండుట జూచి మాయావియగు యక్షుడొకడు వారి విరహావస్థను జూచు కుతూహలముతో నాయిక నదృశ్యము చేయును. ఆపులిన శయ్యపై

ప్రియురాలు లేకుంట జూచి పిడుగుపడినట్లా సిద్ధ యువకుడు జడుని పగిది నిర్విణ్ణుడై యించుక సేపుండి తెలివి తెచ్చుకొని కన్నీరు తడుచుకొని దుఃఖముతో ప్రియురాలి నుద్దేశించి తన పూర్వానుభూతిని స్మరించుచు తనకు ఆమెతోటి ప్రథమ పరిచయము, పరస్పరానురాగము, ప్రేమరాయబారము, దొంగ తనముగ నా యువకుడు ప్రాటిసహాయమున నాయికా భవనము జొచ్చుట, నాయిక యొక్క తండ్రిచేత పట్టుబడి బంధింపబడుట, వీరి ప్రేమానురాగములు గుర్తించి ఆ తండ్రి వారిరువురికి యథావిధిగ పరిణయముచేయుట, ఈ యువ దంపతుల ప్రథమ సమాగమము అను ప్రధానాంశములను గ్రహించి కవి యీ కల్పిత శృంగార కావ్యము రచించెను. ఆద్యంతములు కాళిదాసుని మేఘ సందేశమును బోలి యుండును, కాని కాళిదాసుది ప్రకృతి వర్ణన. ఇందు కల్పిత ముగ్ధనాయిక శృంగారాదులు వర్ణించబడును.

ఈ కావ్యములో ౬౦ శార్దూల విక్రీడితములు, ౨ స్రగ్ధరలు తుదిలోను మొత్తము ౬౨ శ్లోకములు గలవు. మొదటి ౪ శ్లోకములు ఉపోద్ఘాత రూపమున నుండును, తరువాత ౩౮ శ్లోకములలో వారి ప్రేమ సందేశములు, వివాహము, అటుపైన వారి ప్రథమసంభోగము, తుదిలో ఆ యక్షుని మాయచే వారి పునస్సమాగమరూప సుఖముతో కావ్యమంతమగును.

కావ్యము సంభోగ శృంగారమునుగూర్చి వ్రాసినట్లుండుమ. ప్రథమ సమాగమ వర్ణన గనుక ముగ్ధనాయికావర్ణనమిందు ముఖ్యము. మన కవి సంప్రదాయములో విప్రలంభ శృంగారమేగాని సంభోగ శృంగారమంతగా వర్ణనీ యాంశముగ స్వీకరింపబడదు. ఇతని పది రూపకములు గూడ నిట్టి సంప్రదాయభిన్నమగు నట్టి వర్ణనలు గలిగినవేనేమో తెలియదు. తాళపత్రముంపై వ్రాయబడిన మాతృకలేవియు వీటికి లభించకపోవుటకు గూడ నవి పండితా మోదము బడసియుండక పోవచ్చును. అట్టి లోపమును గ్రహించియే యతడీ రెండు కావ్యములను శిలలపై జెక్కించెనేమో. లేకున్నచో ఇతని కృతులలో నేయొక్కటియైనను వ్రాత ప్రతిరూపమున లభించకుండునా? మఱి యెనిమిది సర్గములున్నవని చెప్పిన కాకతీయ చరిత్ర సంగతి యేమిటి ? అది చరిత్రాత్మక కావ్యమైనను అస లీనరసింహుండే ఆనాడు సంప్రదాయ విరుద్ధ రచయితగ సరియగు ఆదరణ పొందక ఇతని రచనలన్నియు నష్టమైనవా

యనిపించును. బుక్కాయ కూడనట్టియై యుండును. ఈ యంశమున తగిన సమాధాన మరయవలసియున్నది. గీతగోవింద కావ్యమువంటివి అచ్చటచట సంభోగశృంగారమును వర్ణించుట కలదు కదా.

కవిత్వము చక్కని ధారాశుద్ధి, అల్ప సమాసములు, మంచి ఉపమానములు గలిగి ఆపాత మధురముగ నుండును. శిలపై పలుతావులలో స్పష్టముగ లేదు. దానికితోడు శిలపై మలచుటలో ననేక లేఖకదోషములు గూడ గలవు. రచయిత కూడ కొన్ని అపశబ్ద ప్రయోగములు చేసినట్లు గానవచ్చును. ఆ కావ్యము నిచట విద్వత్పరిశీలనార్థము పూర్తిగ వ్రాయుచుంటిని. సందేహముగ నున్న భాగములు బ్రాకెట్లలో నుంచబడెను.

శ్లో ౧॥ కశ్చి త్స్నిగ్ధయువా సమందయితయా త్రైస్రోతసే సైకతే
రాగాంధో రమమాణ ఏవ లిఖితే కారండవానాం పదైః।
ద్రష్టుం దుర్విషహాం మనోభవకృతాం తాం తా మవస్థాం తయా
విశ్లేషం గమితః కుతూహలవతా యక్షేణ మాయావినా॥

శ్లో ౨॥ శయ్యాయా మవిలోక్య స ప్రియ తమాం ధంభోశి నేవాహతో
బిభ్రాణః పతదశ్రుణీ కిసలయాతామ్రోదరే లోచనే।
అంసన్యస్తశిరాః శనై రుపచితశ్వాసో వివర్ణానన
స్తూష్ణీ మేవ కమ ప్యనేహస మవిజ్ఞాయైన తస్థౌ జడః॥

శ్లో ౩॥ బోధం ప్రాప్య చ పాథసా మివ నిధౌ నుగ్నోత్థిత స్తత్క్షణా
ద్వీక్షి ప్యాగ్రనఖేన బాష్పకణికాః పక్ష్మావళీ గుంఫితాః।
వ్యాధే నాకులితః కురంగక ఇవాక్రాంత స్స చేతోభువా
దీర్ఘాం ఒతు దృశం సవర్ణ తుహినక్లిష్టారవిందోపమామ్॥

శ్లో ౪॥ త్రిస్రోతోజల మచ్ఛ మాత్తరజసో రోధోలతా మంజరీ
ర్హంసా న్మంజురుతాన్ స్థలాంబుజ వనం స్వర్నాసహాంతర్దలం।
పుష్పాసాద కషాయికంఠ మలినాం బృందం చ (దృష్ట్వో) త్సుకో
వాక్యా న్యేవ మువాచ లక్ష్యరహితం పూర్వానుభూతీః స్మరన్॥

౫ మేరౌ కల్పతరోః ప్రసూనమధునా (స్ప్రు)ష్టేన సిక్తే తలే
సాయం కిన్నరయోషితాం రసవశా ద్గీత ప్రసంగేసతి।
ఆయాతాసి సమం సఖీభి (రథయ...) ద్ది మాలోకితం
బాలే ప్రాథమికం తదేత దధునా ప్యాలిఖ్యతే చేతసి॥

౬. హ (.......................) ష్టాంగులిభ్యాం తదా
సఖ్యాగండ విమృష్ట పత్రతిలకం తత్రైవ కృత్వాముఖం।
వాసః స్రంసన సామిలక్షిత కుచోద్భేదం నమన్మధ్యమం
పాదస్యోపరి(ష)క్త పార్ష్ణి విలగత్పాదం త్వయా హి స్థితమ్॥

౭. స్వైరోత్కూలితసౌహృదేన హృదయే నానేకశః ప్రేరితై
రన్యోన్యాభి ముఖై ర్గతాగతశతైః శంసంతి భావస్థితిం।
లజ్జాకౌతుకయో ర్వశంవదతయా నానాక్రమే ణాభవం
న్నాసన్నేన సఖీజనేన విదితా న్యాలోకితా న్యావయోః॥

౮. ఆకూతేన వికర్షితభ్రుసరసం సఖ్యా కయాపి స్మితం
తద్జ్ఞాత్వా చతురే త్వయా మముఖా దాకృష్య యత్నాదివ।
వ్రీడావిక్లబ తారకాగతిరుషా కించిత్కషాయోదరం
తస్యాం పాతిత మీక్షణం యదభ ల్లీలారవిందాహతిః॥

౯. తద్దృష్ట్వా మయి మందహాససుగమోత్ప్రాశంస మాలోకయ
త్యాసీ ర్నమ్రముఖీ తరంగమరుతా క్షిప్తేవ రాజీవినీ।
కార్యాసంగ ముపేయుషీవ చ తత స్తిర్యగ్దధానా ముఖం
స్వచ్ఛందప్రసరం త్వయా సునయనే భూయో పి ముక్తా దృశః॥

౧౦. కాలే తావతి కాకపక్షకధరే జ్యోన్నద్ధచూడామణి
ర్బిభ్ర న్మౌక్తికకుండలే శ్రవణయోః కోఒప్యాగతో బాలకః।
నక్షత్రద్వయ మధ్యపాతిశశినో బింబం పురోంగారకం
వ్యాకుర్వ న్వదనశ్రి యేందువదనే త్వా మాహ్వయ త్సంభ్రమాత్॥

౧౧ ఆహ్వానే బహుశః కృతేసతి బలాకృష్టేవ ధృత్వా కరే
కర్షంత్యుత్పలి పత్రదామ సదృశే సార్థం మయై వాక్షిణీ।
అంసోపాశ్రయముక్తహస్తకమలం సఖ్యాస్సఖీభి స్సమం
సంలక్ష్యాపరభాగ మంచితపదన్యాసం తతః ప్రస్థితా ॥

౧౨. మయ్యే వార్పిత దృష్టిరాశ్రితవతీ కాంచిత్సఖీ మంగకై
ర్భావై ర్బాలమృణాలకోమలతరైః ప్రాప్తాసి గేహాంకణం।
తోయౌఘే ప్రతిలోమజాతశఫరో త్పాతేవ శైవాలినీ
తీర్థం వారినిధే ర్భృశం త్యుభయత స్తీరస్థలీ మూర్మిభిః॥

౧౩. వేణీవేష్టనశాలినీ శ్రవణయో రారోపితాః కుంతళాః
కించిత్స్రస్తతయా భుజౌ న సరళౌ నోవా సమాకుంచితౌ।
హారః కేసరకల్పిత శ్చ పరతో లంబీ వితంబో ఘనో
గచ్ఛన్త్యాం త్వయిహంసగామిని శనై రేతే మయా లక్షితాః ॥

౧౪. ఉద్విగ్నేవ మృగీ వివర్త్యవదనం ముగ్ధే మృగప్రేక్షణే
స్వాస్యే వాపరభాగ మశ్రుసలిలై ర్ధౌతాంజనైః సించతీ।
మా మాపృచ్ఛ్య పునః పునః ప్రహితయా సఖ్యేవ సుస్నిగ్ధయా
దృష్ట్యా పీతమనస్కయా విషమితై ర్గంతుం ప్రవృత్తా పదైః ॥

౧౫. బింబం వారిణి వారిధే రధిగతా కంపం కళే వైందవీ
రాగోన్మేషవిశేషశాలిహృదయం మయ్యర్పయిత్వా నిజం।
ఆదాయానుగతం మయాపి హృదయం తాదృక్షమే వాత్మనః
కక్ష్యావత్సదనం తదా వినిమయం కృత్వేవ కాంతే విశః॥

౧౬. పశ్చాత్త్వా మసమీక్ష్య హంసగమనే కక్ష్యాంతరాంతర్హితాం
(శ్లాఘ్యంవస్తు వినాశ్య విస్మృత ఇవ ప్రాప్తో విమోక్షం।)
స్వప్నే దృష్టమివైత దాత్మని ముహుస్సంచిన్త్య చిన్తావశో
న స్థాతుం నచ గన్తు మన్యదపివానోకర్తు మీశోభవమ్॥

౧౭. తద్దేశో నవరత్నచిత్రితతలః స్వర్ణానుకూలో౽నిలో
హేలా హేమసరోరుహోదరదళే ష్వాపీతశేషా౽లిభిః।
గీతం కిన్నరయోషితాం సులలితం కల్పద్రుమాః పుష్పితా
యాతాః పఞ్చభి రిన్ద్రియై ర్మమ యథాపూర్వం న భోగ్యాం దశామ్॥

౧౮. కాలే౽స్మిన్ పుటపాకతప్తకనకాకారేణ లోలాకృతిః
సంధ్యామేఘనవప్రవాళ శయనం రాగీ సమాసేదివాన్।
సంతాపా దపరాద్రికందర ఝరీపాథఃకణై రాహతో
నేత్రే మీలయతి స్మ వాసరపతిః పద్మాకరచ్ఛద్మనా॥

౧౯. సార్ధం చేతనయా సమస్తజగతా మస్తం గతో భానుమాన్
వ్యామోహేన సమం తమాంసి పరితః కాష్ఠాః పదం చక్రిరే।
వామైః కాముకలోచనై స్సహ తత స్తారాగణాః పుస్ఫురుః
కందర్పజ్వలనేన సాక ముదయం యాతః కలానాంనిధిః॥

౨౦. ఆదౌ యావకపంకపాటల మథో బింబీఫలాభం తత
స్సద్యోత్కలితాన బహిష్ఫలాశ వికచస్వర్ణారవిందోపమం।
పశ్చా దాసవమత్తమాళవ వధూగండస్థలప్రక్రియం
బింబం చాంద్రమసం క్రమాద్విరహిణీవక్త్రోపమాన దధౌ॥

౨౧. జాతే నూతన చంద్రకాంత శిశిరే దేవే దిశామంతరే
వేలోల్లంఘిభి రూర్మిభిః కలశవారేశే రివ క్షాళితే।
శ్వేతద్వీప ఇవక్షణేన భువనే సంలక్షితే సర్వతో
ధ్వాంతం నక్వచి దాతతాన పద ముద్భ్రాంతం వినామే మనః॥

౨౨. ద్వంద్వై రాత్రివియోగినాం విధివశా దన్యాదృశైః పత్రిణా
మాశ్లేషా ద్గరుతో రజస్స ఘటనా విస్రంభిణః ప్రచ్యుతైః।
ఆవాభ్యా మివ విప్రలంభవిషమా మాసేదివద్భి ర్దశాం
క్రందద్భి స్స్వరదీర్ఘకాపరిసరే కా ప్యానశే దుర్దశా॥

౨౩. ఆనందామృతవర్షిణీ నయనయో రంభోదలేఖా నవా
యష్టిః సౌహృదవీరుధ స్థిరతయా సౌహిత్యసంపాదినీ।
కందర్పేషుగవాక్షితస్య మనసో జీవాతు భూతా సఖీ
త్వ త్తః కాచి దుపాయయా మమ పునః క్షీణాత్మన స్సన్నిధిమ్॥

౨౪. జానానేవ మమావలోక్య వదనం సాకూతమాతన్వతీ
భ్రూరేఖా మరవింద (గర్భవిచల ద్భృ) ంగావలీ విభ్రమామ్।
సాస్మేరేణ ముఖేందునా పరిచితే వానేకకాలం స్థితా
విస్రంభో త్తర మాదదే గిర మిమా మాపాదయిత్రీం (ధృతేః)॥

౨౫. అయాతాస్మి తవాంతికం ప్రియసఖీ మాలోక్య భగ్నాశయాం
మగ్నాంతఃకరణాం త్వదాననరుచౌ లావణ్యసింధావివ।
క ర్తవ్యేషు విమూఢతా ముపగతాం కందర్ప నిఘ్నాం సఖే
బంధూనాం సుఖదుఃఖయో ర్భవతి [యా సే నేవహి ప్రాణ్యతే]

౨౬. ముగ్ధాముగ్ధమృణాలకోమల తను స్తన్వీ కఠోరాత్మనః
శ్యేనస్యేవ శుకీ మృగీవ మృగయో రాహో రివేందోః కలా।
పుష్యంత్యం (తీం) మనసో రుజా మతిభృశా మజ్ఞాతపూర్వాం సఖే
సంప్రాప్తా తవదర్శనా త్ప్రభృతి సా చేతోభువో గోచ(రామ్)॥

౨౭. ప్రాసాదే క్షణ మంకణే క్షణమతో లీలాసరస్యాం క్షణం
క్రీడాపర్వతకే క్షణం ప్రియసఖీసంలాపగోష్ఠ్యాం క్షణం।
శయ్యాయాం క్షణ మంతరే క్షణ మథ ద్వార్వేదికాయాం క్షణం
సా త్వామేవ విచిన్వతీవ బహుధా జాతారతి ర్వ ర్తతే॥

౨౮. తిష్ఠ త్యుచ్చలతి ప్రయాతి పున రప్యాయాతి సంభాషతే
తూష్ణీంభావ ముపైతి పశ్యతి దిశః సంమీలయ త్యక్షిణీ।
ఉద్భ్రామ్య త్యధికం దధాతి చ ధృతిం నిశ్చేష్టతే చేష్టతే
హా! కష్టం! మదనేన దారుణతరం కిం కిం నసా కార్యతే॥

౨౯. ఇత్యాకర్ణ్య హలాహలేన సురయా చాప్లావితం తద్వచ
స్తత్కాలే యుగపద్గ్రహీత హృదయః క్లేశేన హర్షేణచ।
చేష్టాభి ర్మమ పూర్వమేవ కథితా మున్మ స్త (త?) కాం తాం దశాం
కందర్పాపశదస్య దుర్విలసితం చాశంస మస్యాః పురః॥

౩౦. శ్రుత్వా మద్వచనం నివేద్యచ పుర (స్త్వత్తః) పునశ్చాగతా
మా మన్వే ద్యు రవోచ దేవ మవినాభూతం త్వయా చేతసి।
వాచా స్నిగ్ధమనోహర ప్రసరయా పీతశ్రమం కుర్వతీ
వృష్ట్యా వారిధరావళీవ వివశం తృష్ణావశా చ్చాతకమ్॥

౩౧. ప్రాత శ్శీకమయూఖకాంతి (మజయా) శూన్యం దధానా వపు
ర్మగ్నై ర్లక్ష్యవినాకృతై రలసతాం వ్యావృణ్వతీ వీక్షణైః।
శ్వాసా నభ్యధికోష్మణా (గ్ల) పయతో దంతచ్ఛదం ముంచతీ
త్వద్ధ్యానైక పరా ధిరోహతి పరాంకోటిం స్మరవ్యాకులైః॥

౩౨. ద్రష్టవ్యః కథమేష దృష్టిసుభగః సంభాషణీయః కథం
శ్రోత్ర స్వాదువచా స్సుసంహతవపు స్సంశ్లేషణీయః కథం।
సాన్నిధ్యా విదితాన్య వస్తు విషయః సంసేవితవ్యః కథం
సేత్థం త్వాం ప్రతి చింత (య) త్యహ రహం పర్యాకులావత్తతే॥

౩౩. సుప్తాంతఃపురికే నిశీథసమయే గాఢే తమోభిర్ఘనై
ర్భిత్తే స్సనిధిమేహి నీలవసనో నీచైః పదాని క్షిపన్।
రజ్జ్వా త్వాం దృఢయా నయేయ మితి సా సందిశ్య సాశ్వర్థనం
యాతాతే సవిధం సరోజవదనే భృంగీ నళిన్యా ఇవ॥

౩౪. యాస్యామ్యేవ మివాంత రేవ మివ చ స్థాస్యామి తస్యాఃపురో
వక్ష్యా మ్యేవ మివాహమేవ మివచ ద్రక్ష్యామి లీలాయితం।
ఇత్థం పక్ష్మశతై ర్మనోరథశతై ర్భూయోను సంపాతిభి
స్సోత్కంఠః కథమప్యహోపయ మహఃశేషం విశేషోత్సుకః॥

౩౫. ఆ నిద్రాసమయం కథం కథమపి స్థిత్వా ర్ధరాత్రే వ్రజ
న్నిశ్శబ్దం ప్రపదేన మందవిహితశ్వాసః ప్రదీపాత్త్రసన్।
జిహ్మైకాంత పథ స్తృణే పి చలితే శంకాం దధానో న్యథా
ఛాయాం స్వామపి వీక్ష్య వేపితవపుః ప్రాప్త శ్శనై శ్చోరవత్॥

౩౬. అధ్యారోహణ మాచర త్కథమయి వ్యాలంబమానాం క్వచిత్
ధృత్వా రజ్జు మలక్షితాభిగమనం నానావిధై రాయుధైః।
వాద్యై ర్దారుమయై ర్వచోభి రుచితై (రుచ్చైః క్వణత్కా)హళం
కైశ్చి చ్చోధనదీపికా పరికరై రాసన్న మారక్షకైః॥

౩౭. త్వత్సఖ్యా సహ భీరుభీతమనసా సోఽహం గృహీతో హఠా
దేభి ర్నిష్కరుణై రజాత కరుణం చోరోఽయ మిత్యర్భృతః।
పిత్రా తే కనకాంగదేన నిభృతం కుత్రాపి కోణేఽంతరే
వారీసంయతవారణేంద్రవిధినా స్వేమందిరే స్థాపితః॥

౩౮. ఆశంసా శత చిత్రితాని పునరప్యుద్భ్రాంతిసమ్మూర్ఛితా
న్యానందక్షణ శోభనక్షణ పరీణామాని విష్టానిచ।
శ్వాసై ర్మర్మరితాని బాష్పసలిలై ర్లంబాశితాన్యపి మే
నిర్వేదాద్వ్యధికాని కాన్యపి యయుః కృచ్ఛ్రాదహో న్యావయోః॥

౩౯. విజ్ఞాయాఽథ సఖీముఖేన సకలం తై స్తై రుపాయాంతరై
స్సంబంధోచిత మాభిజాత్య మమలం వృత్తం కులం చాపియే।
ముక్తం సంయమనా త్స తే జనయితా నానావిధై రర్హణై
ర్మామభ్యర్చ్య వివాహయోగ్య మనఘం లగ్నం ప్రతీక్ష్య స్థితమ్॥

౪౦. లగ్నే సమ్యగుపస్థితే యవనికాపాయే చ దృష్టం మయా
లోధ్రానద్ధవిపాండుగండఫలకం నిర్ణిక్త దంతావళి।
స్వాభావ్యా దరుణోష్ఠ మాత్త తిలకం నేత్రాభిరామాంజనం
దూరోత్తంసిత శేఖరం సుముఖి తే ముగ్ధావసంతం ముఖమ్॥

౪౧. వేదీమధ్యనివేశితం హుతవహం కృత్వా విధే స్సాక్షిణం
స్వేదాంభః కణికాభి రంగులిముఖా ద్వాంతాభి రార్ద్రస్తవ।
ఉద్భిన్నై ష్ష రరవిందనాళ సదృశీ మాభాం గతః కంటకై
రూర్ణైః కంకణవాన్ ప్రవాళమృదుల స్పర్శో గృహీతః కరః॥

౪౨. మాంగల్యే విధి [షే] మహాపరికరై ర్జాతే వివాహోత్సవే
సౌత్సుక్యం తళిమాధిరోహణసుఖే ప్రాప్తే చ సార్థం త్వయా ।
యాతాస్తే నవభంగి గూఢ వచనై రాళీజనస్య ప్రియై
ర్హాస్యప్రాయరసై ర్వివాహ దివసా నానాక్రమై ర్నర్మభిః॥

౪౩. బాలే వాసనికేతనం ప్రతి బలాద్ధాత్ర్యా ముహుశ్చోదితా
కుప్యంతీవ నిశమ్య మద్విషయిణీ మాళీభి రుక్తాంగిరం ।
ఉత్కంఠా మతిమాత్ర మంతరుదితా మాబిభ్రతీ విక్లబా
లజ్జా నమ్రముఖీ చిరాయభవతీ ధాత్రీభి రానీయతే ॥

౪౪. శయ్యాయాం వినివేశ్య నిర్గతవతీ ర్ధాత్రీరను ప్రస్థితా
మాశిష్ట్వాం రుదతీ మపి స్థితవతీ కాచిన్నిషిధ్య స్వయం ।
ఆసన్నే మయి తాం నిషేద్ధు మపి చ ప్రాయః ప్రియే లజ్జితా
తూష్ణీ మేవ నివర్తితానన మధోదృష్టి ర్నివిష్టా క్షణమ్ ॥

౪౫. ఆభాష్యే యది సాధ్వసం తవ భవే త్తూష్ణీం యది స్థీయతే
స్యాదేవాగణనేతి మూఢహృదయః కించి ద్విచింత్యాత్మని ।
త్వత్సఖ్యా సహ కాని కాన్యపి వచాం స్యజ్ఞాతనిద్రారసో
హాస్యప్రాయ కథాప్రబంధసరసా న్యాఖ్యాతు మారబ్ధవాన్ ॥

౪౬. తావ(త్త్వం) పిశనై ర్మమాన్యపరతా మాలోక్య సంకోచితై
రంగై రంశుక వేష్టితాంచిత పురోభాగై ర్హ్రియా మీలితా ।
నిద్రాణేవ నిమీల్య నేత్రకమలే తాస్తాః కథాః శృణ్వతీ
శయ్యాంతం భుజవల్లరీ వివలనే నాలింగ్య జోషం స్థితా ॥

౪౬. ఏవం ప్రత్యురసోపమర్దిత మనో నిర్వే(శ) వత్యః సుఖా
(నిష్పర్యాయ మనోరథాచ్చ తనిమోచ్ఛ్వాసా) భయవ్యాకులాః ।
(లజ్జాగంధి) సమ స్తవస్తు సరసా లజ్జావతి ప్రాగమూ
స్త్వత్సాన్నిధ్య మిహాభిమానసుహృదా భుక్తా మయా రాత్రయః ॥

౪౭. ఆసీనా మతిసంభ్రమేణ విమతౌ క్రీడాసు వాచితనో
ర్వ్యాజస్పృష్టక కేళిభి ర్ఘనఘనై ర్వేణ్యా శ్లథాయా అపి ।
గుంఫై ర్హారగుణస్య చ త్రిచతురై స్సార్ధం తయా మత్సరా
విస్రంభాసవ భిక్షుకాళన దివ్యైః కించిన్మయా సాదితే ॥

(శాసన మందు ౪౭ వ శ్లోకము తరువాత కొన్ని శ్లోకములు సరిగా కనుపించుటలేదు కనుక వాటి సరియగు పాఠము కుదురుటలేదు)

౪౯. ఏతస్మి న్సమయే నిశాంతభవనా ద్వ్యాజేన సఖ్యా బహి
ర్నిర్యాతే మమ సన్నిధౌ సునయనే పూర్వాధికం బిభ్యతీ ।
నిర్గంతుం త్వరితా మయా కరతలే నాలంబితా త్వం స్థితా
వాతోద్ధూతనవారవింద సదృశౌ వ్యాపారయ న్తీ దృశౌ ॥

౫౦. ఈషత్సాంత్వనభంగిబోధితమనా స్త్వం కంచుకికర్షణే
ప్రక్రాంతేఽథనఖక్షతాదపి భయా దత్యంత ముద్వేజితా ।
కాంతే కేవల మంగకైః పులకిభిః కంఠా క్షతావస్థితి
ర్వాష్పోత్పీడవశా న్నిమీలితవతీ లజ్జాకులే లోచనే ॥

౫౧. (ప్రాంచీ) భూత ముఖారవింద ఘటనా త్ప్రాయాత్కపోలస్థలే
కస్తూరీ మకరీవిలాస హరణం సాముఖ్యయోగా త్తవ ।
మౌగ్ధ్యాది ప్రతిరోధపం కృశమపి స్థిర్యేత య త్తత్త్వయా
హ స్తస్వ స్తిక జాతరోధ మనతి వ్యాసంగ మాలింగనమ్ ॥

౫౨. నీవీ బంధ నివేశితే కరతలే నిర్వేశతంద్రావశా
దీషన్మీలనజాతశారదనదీకార్ష్యానుకారే దృశౌ ।
ఆసీ త్తే సుఖపారవశ్యశిథిలం తద్ధారణే వ్యాపృతో
హస్తో మర్మ మయూఖమాలికిరణస్పృష్ట ప్రవాలోపమః ॥

౫౩. క్రీడానంతర మా త్తసాధ్వసతయా నిశ్చేష్టితై రంగకైః
శ్లిశ్య న్నీర కుచాంశుకావృతముఖీ వాక్యాసహంతీవ మే ।
మందోద్ధూతపటాంచలేన సిచయే నావీజ్యమానా మయా
లజ్జామీలితలోచనైవ శనకై ర్నిద్రాం త్వ (మాసాధయః) ॥

౫౪. పర్యాయా చ్ఛ్రివబద్ధపుష్పపతనం సంమీలితే లోచనే
(కాలీయైః?) శ్రమవారి లేశలులితైః (సిక్తా) చ తే కంధరా ।
స్రస్తేవాససి లక్షితాంగసుషమా భేదం చ తాంతం వపుః
(......) స్థితిశ్లథ నిజావస్థాపి చ స్మర్యతే॥

౫౫. (ఆలేపై ర్గలితై ర్నితంబిని దధౌ నిమ్న) స్థలే ష్వాసితా
కంఠః కంబునిభో మదీయవలయే నాలింగనై ర్ముద్రితః।
గాత్రం తే ప్లరివ ర్తనేన శయనే వాస స్తరంగాంకితం
కాంతిః కాచన సామము క్తజడిమా నిద్రావసానే దృశోః॥

౫౬. మ్లానం చాపి వికాసి చాపి వదనం వేణీ చ వేష్టశ్లథా
ఫాలశ్చ శ్రమవారిమృష్టతిలకో హాసశ్చ సంజాయతే।
మాయా కాపి చ లక్ష్యతే నయనయో స్సంమోదసంసూచనీ
భుక్తా సీతి సఖీభి రీరితరహః కృత్యా భృశం లజ్జితా॥

౫౭, జానీ షే కిము కల్పపాదపభవా మాపీయ హాలాం త్వయా
క్రీడంత్యా మమ సన్నిధావపి నిజా మున్ముచ్య ముగ్ధే త్రపాం।
యద్యజ్జల్పితము గ్ధజాతవి(ల) యై రాలస్యవద్భిః పదై
రంగై ర్వా శ్లథసన్నివేశ లఘుభి ర్యద్యత్కృతం స్ఫుర్తిక్రమాత్॥

(మూడవ పాదములో 'జల్పిత' అను రూపము చింత్యము, 'జల్పితం' అనునది ఛందోభంగ మగును. యోచించదగును.)

౫౮. ప్రత్యంగం నవచంపకేష్వివ రజోవ్యా సర్వ మున్మీలితం
కాంతి ర్నూతనకౌముదీకువలయా పీతేవ జాతా దృశోః।
హాసశ్రీ ర్ముఖపంకజే మధుమదా దుల్లిలితే వాధికం
వైదగ్ధ్యం స్ఫుటితా దివేందుముఖి తే స్వాంతా దహో బింబితమ్॥

౨౯. హర్మ్యం హారి ఖలూరికా మణిమయీ నవ్యోపి రోమా స్త రో
హా(సో)త్కూలనమాత్ర లక్షిత నిజావస్థాన ( - - ) మమ।
శాత్యం చందన మంబరాణి చ తనూ న్యాగంధయో మాలికా
స్తాంబూలీదలపూగఖండ భరితం పాత్రంచ నః ప్రీతయే॥

౬౦. గూఢా భూమి(గృహాః క) రండ సుషిరాధ్మాంతా శ్చ ధూపాంకురా
స్తైలో ద్గంధి [శిలాశ్మ] దీపలతికా స్థూలంచ తూలాంబరం।
కాలేయేంధన పావకాచ శకటీ కస్తూరికా మిశ్రితం
తాంబూలం నవయౌవనోష్మ శకుచా త్వంచ ప్రియే మే ప్రియమ్॥

౬౧. ధారోద్గారి ప్రనాళీముఖరకరి ముఖం భూమికావచ్చ హర్మ్యం
రమ్యైకాంతా చగోష్ఠీ ప్రచురమలహరీ రాగమిష్టం చ గీతం।
సూక్ష్మం శ్లక్ష్ణం చ వాస స్తరుణిమఖిదురో ద్వృ త్తవక్షోజకుంభా
స్వేచ్ఛా భోగక్షమాచ త్వమతి సుముఖి మే కాపి వర్షాసు రీతిః॥

౬౨. భోగానేవం ప్రకారా న్మహం తనుభవతో హంతమే విప్రయోగో
జాతః కస్మా దిదానీం తవ సుతను హతా దిత్యము ష్మి న్నువాణే॥
యక్షః సందర్శ్య రూపం తటి దుదయ మివ స్వం విహాయా పిమాయా
మేతాభ్యాం దంపతిభ్యాం సహ్ఫ నయ మవిధా దాశిషం పూర్ణకామామ్॥

విశ్వేశ్వర సూనో ర్నరసింహార్యేః కృతిః.

సంక్షిప్త భావార్థము

౧. ఒకానొక సిద్ధయువకుడు తన ప్రేయసితో రాగాంధుడై కారండవ పక్షు ల వర్తించిన పద చిహ్నము లగల గంగానది యిసుకతిన్నెలపై క్రీడించు చుండెను. శరత్కాలములో నదులలో నీరు తగ్గి యిసుక తిన్నెలు బయల్పడి రెఱకాలతో మెత్తని యిసుక చక్కని శయ్యవలెనుండి నట్లుండును. వాటిపై నీటి యొడ్డున జంతువు పక్షులు సంచరించినట్లచ్చ టచట గుర్తులుండుట ఆ తిన్నెలు రోసిపోయినట్లుండక యొక ప్రకృతి రమణీయతను గూర్చుచుండెను. ఇట్టి రమణీయసన్నివేశమున క్రీడించు

చున్న ఆ సిద్ధయువకున్ని విరహావస్థను జూడ కుతూహలముతో నొక యక్షుకు తన మాయతో వాని ప్రేయసి నదృశ్యము చేయును.

౨. ఆ యువకునికది అశనిపాతము వలెనయ్యెను. దుఃఖముతో కళ్లు చిగురాకులవలె నెఱ్ఱనై నీళ్లుగారును. శిరము భుజముపై వాల్చి విషణ్ణాననుడై యేమియు తెలియక జడునివలె నిలిచిపోయెను.

౩. కొద్దిసేపటిలో తెలివి తెచ్చుకొని దుఃఖసముద్రములో నుండి తెప్పరిలి కనురెప్పలలో నిండియున్న బాష్పకణములను గోటితో తొలగించి వ్యాధునిచే బట్టువడిన లేడిపిల్లవలె మనోభవునిచే పట్టుబద్ధవాడై మంచుతో కప్పబడిన తామరరేకువంటి కంటిని నలువైపుల ప్రసరింపజేసెను.

౪. గంగాజలమతి స్వచ్ఛముగ బాఱుచుండెను. తీరమందున్న లతామంజరులు పుప్పొడితో నిండెను. హంసలు మంజుల ధ్వని చేయుచుండెను. మెట్ట తామరల దళములతి సున్నితముగ నుండెను. పుష్పము లాస్వాదించి వగరెక్కిన కంఠములతో తుమ్మెదలు ధ్వని చేయుచున్నవి. వీటిని చూచి యుత్కంఠతతో తన పూర్వానుభూతులను స్మరించుకొనుచు లక్ష్యరహితముగ నిట్లు పలికెను.

ఇచటనుండి తన ప్రియురాలితో మాట్లాడుచున్నట్లు చెప్పును.

౫. ఒకనాటి సాయంకాలము మేరుపర్వతముపై కల్పవృక్ష ప్రసూనముల తేనియలతో సిక్తమైన చోటున కిన్నర స్త్రీలు గానసభ చేయుచుండగా సఖులతో గూడి ఆ నాయిక అచటికి వచ్చెను. ఆమె చూచిన చూపులు తన మనములో నింకను గుర్తున్నవనును.

౬. సఖి గండస్థలముపై పత్రతిలకము సర్దుచుండగా నామెయఱ్ఱిపై వస్త్రము జారుటచే కొంచెమే వ్యక్తమగుచున్న కుచములు, వంగిన నడుముగలదై పాదముపై వేఱొక పాదము తగులునట్లుంచి యుండెను.

౭. స్వేచ్ఛగా నిట్లొకరినొకరు భావగర్భితమగు ప్రేమపూరితదృక్కులతో చూచుకొనుచుండగా నామె సఖులిది కనిపెట్టిరి.

౮ సాభిప్రాయముగ కనుబొమ్మలు త్రిప్పి యొకతె నవ్వెను. అంత నీమె యాచెలికత్తెను లీలారవిందముతో కొట్టినట్లు కోపారుణిత నేత్రముతో జూచును.

౯. తరువాత మందహాసముతో ఆ నాయకుని వైపే జూచుచు తరంగముల గాలికి నెట్టబడి వంగియుండు తామర తీగవలె ముఖము వంచుకొనెను. మరల ముఖము త్రిప్పి వానివైపు జూచును.

౧౦. ఈ సమయములో నొక బాలుడు వచ్చి ఆమె నింటికి రమ్మని పిలుచును. ఇచట ఆ బాలకుని వర్ణన గమనించదగియున్నది. వాని కాకపక్షములపై నొక చూడారత్నము కెంజాయగలది పైకి కట్టబడెను. చెవులకి ముత్యము లుండు కుండలములుండెను. వీటితో వాని ముఖము రెండు నక్షత్రముల మధ్య ఎఱ్ఱని అంగారక గ్రహమున కెదుటనుండు చంద్రబింబము యొక్క శోభను గలిగియుండెను ఇచట కుండల మందలి ముత్యములు తెల్లగా నక్షత్రములవలె నున్నట్లును, చూడామణి యెఱ్ఱగా అంగారక గ్రహము వలెను, వాని ముఖము చంద్రబింబముతోను బోల్చబడెను. రెండవ పక్షమున, ప్రస్తుత నాయికానాయకులు నక్షత్రముల వలెను ఆ బాలకుడు చంద్రుని వలెను, వానిరాక కుజగ్రహము వలెను, వ్యంగ్యముగ దోచుచున్నది. నూతన దంపతుల మధ్య అంగారక దోషమనునది సంభవించకుంట జూచుచుందురు. ఇచట వీరి మధ్య ఆ పిల్లవాని రాక అంగారక దోషము వలె నడ్డువచ్చెను.

౧౧. ఆ బాలకుడామెను బలవంతముగ చెయ్యిపట్టుకుని లాగుకొనిపోవును. అరవింద దళముల త్రాడునుబోలు నేత్ర పంక్తి వానిని (నాయకుని) కూడ లాగుకొనిపోయినట్లు అడుగులు వేయుచు ఆమె బయలుదేరెను.

౧౨. జడ చుట్టుకొనుచు, కొద్దిగా జారి చెవులపై నున్న ముంగురులు కొంచెం వంకరగా నుంచిన బుజములు, కేసరముల హారము వెనుక వ్రేలాడుచు, ఘనమగు నితంబముతో హంసగమనముతో నామె పోవుట నాతడు జూచును.

౧౯. అతి స్నేహముతో తనను ఆమె మాటి మాటికి పిలుచు చున్నట్లు దృష్టుల వెనుకకు ప్రసారించుచు పోవుచుండును.

౧౪. ఆమె రాగోన్మేషవిశేషశాలియగు తన హృదయమును (బింబమును) వానియందుంచి సముద్రములో కంపించు చంద్రకళవలె గదులనుండి దాటుచు తన భవనములో ప్రవేశించెను. చంద్రకళ సముద్రతరంగము లపై నొకటి తరువాత నొకటి దాటుచు పోవునట్లామె గది విడిచి గదిలోనికి పోవుటనాతడు చూచును. అతను కూడ నట్టి హృదయముతోనే ఆ భవనము వఱకు పోవును.

౧౫-౧౬. ఆమె లోనికి పోవును. (ఇచట శ్లోకములో రెండవపాద మస్పష్టముగ నున్నది) ఇదంతయు స్వప్న వృత్తాంతములె మాటిమాటికి తలపోయుచు నతడు అచట నుండుటకుగాని, వెళ్ళుటకుగాని, మఱేదైనను చేయుటకు గాని తోచక నిలబడెను. (వటువు వేషముతో శివుడు తపోనిష్ఠలోనున్న పార్వతితో వాదించి తుదకు తన నిజరూపముతో నామెను పట్టుకొన్నగా నామెను 'మార్గా చలవ్యతికరా కులితేవ సిన్ధుః శైలాధిరాజ తనయా నయయౌ నతస్థౌ' అని కాళిదాసు వర్ణించెను. కుమా. 5-85). ప్రస్తుత మున, ఉండుటయూ, వెళ్ళుటయూ అను వికల్పములేగాక 'అన్యదపివా నోకర్తు మీశోభవం' అని యింకేమి చేయవలెనో కూడ తోచనిస్థితిలో ఈ యువకుడుండెను.

౧౭. ఆ భవనము ముందు పంచేంద్రియములకు నాకర్షకరములగు సన్నివేశము లుండెను. రత్న చిత్రిత తలము, స్పర్శానుకూలమైన మందానిలము, హేమ సరోజములందు తుమ్మెదలు త్రాగగా మిగిలిన మద్యము (మేరువు పైన గనుక) కిన్నరస్త్రీల గీతము, పుష్పించిన కల్పతరువులు, తన యెదుటనున్నను వానికవి పూర్వమువలె నుద్దీపకములుగ రుచించుటలేదు.

౧౮. ఇచట కవి సూర్యాస్తమయము, చంద్రోదయముల వర్ణించును. పుటపాక తప్తమైన బంగారు ముద్ద లె నూగుచున్న ఎఱ్ఱని సంధ్యామేఘములనెడి నూతనములగు చిగురుటాకుల శయ్యపై నెఱ్ఱనివర్ణము గలిగి పరుండి, సంతాపము వలన అస్త్రాదికందరములందున్న సెలయేళ్ల నీటితుంపరలు

జల్లుచుండగా సూర్యుడు పద్మాకరముల మిషతో నేత్రములు మూయుచుండెను. ఇచట కథానాయకుడు నాయికయం దనురాగము గలిగి విరహ సంతాపమునందున చిగురుటాకులపై పరుండ నిచ్ఛయించుట సూచితము. సూర్యునికి పగలంతయు నెండలో తిరుగుట వలన సంతాపము జెప్పబడెను.

౧౯. సమస్త జగత్తుయొక్క చేతనతోబాటు భాను డస్తమించెను. వ్యామోహముతోబాటు చీకట్లు దిక్కులన్ని వ్యాపించెను. కాముకుల కుటిల నేత్రములతోపాటు నక్షత్రములు తళుకుమనుచుండెను. కామాగ్నికి తోడై చంద్రు డుదయించెను ఈ శ్లోకములో సార్ధం, సమం, సహ, సాకం అను నాలుగు సమానార్థక అవ్యయముల నుపయోగించి నాయకుని కామాగ్నిని తత్కాల స్థితులతో బోల్చెను.

౨౦. మొదట యవక (అంచందుల) పిండివలె లేత యెఱుపు వన్నెయు, తరువాత దొండపండు రంగును, తరువాత మోదుగమాల మధ్యనుండిన స్వర్ణారవిందము వలెను (ఎఱుపు, పసుపు, తెలుపు గూడిన యొక చిత్రవర్ణము), తరువాత మద్యము త్రాగుటచే కందిన మాళవ వధువు యొక్క గండస్థలము వలెను, తుదకు విరహిణీ ముఖమువలె వెలవెల బాఱుచు చంద్రబింబము పైకి వచ్చెను.

ముందు నాయక విరహమును సంధ్యామేఘనవప్రవాళములందు పరుండు సూర్యునితో బోల్చి, తరువాత నాయికా విరహము నిందు వర్ణించెను.

౨౧. చంద్రుడుదయించి తెల్లని కాంతి దిక్కులంతట వ్యాపించగా ఈ భువనమంతయు శ్వేతద్వీపమువలె నుండగా తన మనమునందు తప్ప మఱి యెచటను చీకటి యనునది లేకుండెనని నాయకుడు చెప్పెను.

౨౨ తమ యిరువురివలెనే ఆ సురదీర్ఘికా పరిసరమున రాత్రి వియోగమును సహింపని, అజస్రఘటనా విస్రంభము నంది విడిపోయిన చక్రవాక మిథునములో శోక నాకానాక దుర్దశ వ్యాపించెను.

౨౩. ఇంతలో ఆనందామృతమును గురిపించు నూతన మేఘ పంక్తి వలె, సౌహృదవీరుధమునకు ప్రాకుడు కఱ్ఱవలె, మన్మథ బాణములను గవాక్ష ములోనున్న మనమునకు సంజీవని వంటి ఒకానొక సఖి ఆ నాయిక నుండి వానికడకు వచ్చును.

౨౪. వెనుక పరిచయమున్నదానివలె నామె వానితో భావగర్భితముగ నిట్లు చెప్పను.

౨౫. భగ్నాశయమైన ప్రియసఖిని జూచి ఆమె వానియందనురక్తమైవున్నదని తెలుపును.

౨౬. దేగవలని భయముతో ఆడచిలుకవలెను, వ్యాధుని భయముతో ఆడలేడి వలెను, రాహువు వలన చంద్రకళ వలెను, ఆమె వానిని చూచినప్పటి నుండి మనోభవునివలన నొకానొక అనిర్వచనీయమగు బాధ నొందు చుండెను.

౨౭. ఆమె వ్యథ నిట్లు చెప్పను. ప్రాసాదములో క్షణము, ముందు క్షణము.

౨౮. లీలాసరస్సులో క్షణము, క్రీడాపర్వతపై క్షణము, ప్రియసఖుల సల్లాప ముతో క్షణము, శయ్యపై క్షణము, గడపలపై క్షణము, నిలుచొని, కూర్చొని, వెనుకకు నడచుచు, ముందుకు నడచుచు, నిశ్చలముగాను, అదేదో పరిపరి విధముల నుండి అరతి యను మన్మథావస్థను కలిగి యున్నది. ఇచట పలుమార్లు క్షణ పద ప్రయోగము జేసియు, అనేక క్రియాపదములతోను ఆ యవస్థను సూచించెను.

౨౯. నాయకుడామె విరహావస్థను హాలాహలము వలెను, మద్యము వలెను మిశ్రమమగు ననుభవములతో గ్రహించెను. అపైన తన అవస్థను గూడ నామెతో

౩౦-౩౨. నాయికకు తెలియజేయవలెనని చెప్పను. ఆమెయు నట్లే నాయికతో నితని సుముఖతను తెలిపి మఱునాడు మఱల అతని దగ్గరకు వచ్చి

ఈ సందేశము చేరవేయును. ఆమె విరహవేదనను గూడ మఱల చెప్పును.

౩౩. ఆ సందేశములో అందరు నిద్రపోయిన పిదప చీకటిలో నిశ్శబ్దముగ నల్లనిగుడ్డ కప్పుకొని ఆమె అంతఃపుర భవనము యొక్క ప్రాకారము ప్రక్క నిలబడుచో త్రాడు సహాయముతో పైకి ప్రాకుటకు వీలు కల్పించ బడునని చెప్పును.

౩౪. (మఱునాటి) పగలంతయు ఈ యువకుడు తా నా యువతి యొద్ద కెట్లు చేరవలెనో, యెట్లామెతో సంభాషించవలెనో, యెట్లు వ్యవహరించవలెనో మున్నగు ఆలోచనలతో గడుపును.

౩౫-౩౬. నిర్దేశించిన రాత్రివేళలో నితడు ఆమె ప్రాసాదముపైకి త్రాటి సహాయమున దొంగవలె ప్రాకిపోవుచుండగ నచటి రక్షకులచేత పట్టుబడెను. వానితోబాటు వాని నచటికి చేర్చుచున్న చెలికత్తియ గూడ పట్టుబడెను

౩౭. నాయిక తండ్రియగు కనకాంగదుడు వీనిని దొంగ యని బంధించును.

౩౮-౪౨. నిర్బంధములోనుండగా కనకాంగదుడు ఈ యువకుని ఆభిజాత్యాదులు విచారించి వానికి తన కుమార్తెను ఇచ్చి యథావిధిగ వివాహము జేయ నిశ్చయించును. ఒక శుభలగ్నమున వారిరువురికి అగ్నిసాక్షిగ ఉద్వాహము జరుగును. వివాహ వర్ణనము.

తరువాత శ్లోకములందు వారి సంభోగ వర్ణన, సంభోగానంతరమున నాయికా వర్ణన, నూతన దంపతుల కుండవలసినట్టి ఇతర సన్నివేశములు పేర్కొనబడెను. తుదకు యక్షుడు తన మాయను తొలగించి ఆ నాయికను యథాపూర్వముగ నా యువకుని దగ్గరకు జేర్చును.

ఇది విశ్వేశ్వర సూనుడగు నరసింహార్యియొక్క కృతి.

## 16. సిద్ధేశ్వరగుట్ట (అసంపూర్తి) కావ్యము

అనుమకొండ సమీపమున సిద్ధేశ్వరగుట్టపై నొక అసంపూర్తి కావ్యము గలదు. దీని రచయిత పేరు చెప్పబడలేదు. కావ్యము కూడ 37 శ్లోకములతో నసంపూర్తిగ నున్నది. ఇది నిరోష్ఠ్యము (ఎ. ఇండికా ౩౬ పుటలు 209-15),

కావ్య పద్ధతిలో నారంభింపబడి, ఆంధ్రదేశము, అందలి శాలిక్షేత్రములు, వనములు, ఏకశిలానగరవర్ణనకొంత మాత్రమిందు గలవు. దీనిని మొదట కీ.శే. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు 1924 సెప్టెంబరు భారతిలో ప్రకటించిరి. తరువాత ఎపి. ఇండికా పైకుడివికట్లు నా మిత్రులు శ్రీ వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ పి. ఆర్. శ్రీనివాసన్‌గారు విపులమగు నుపోద్ఘాతముతో బ్రకటించిరి. వీరలకు కృతజ్ఞ దెలుపుచు ఆ శ్లోకము లుదహరించెద.

ఈ శ్లోకములందు సరళశైలి భావ రమ్యతలతోబాటు అనుప్రాసాదులతో గూడిన శబ్దరమ్యత గూడ హృదయంగమముగ నుండును.

౧. ఆంధ్రా స్సన్తి గరీయాంసః కాంచనచ్ఛాయశాలయః।
యథా హాటకశైలస్య కటకా రత్నశాలినః ॥

౨. కేదారా యత్ర శాలీనాం తరంగిత జలాంతరాః।
కృష్ణాంగచ్ఛాయహరితా యథా జలనిధే స్తటాః॥

౩. శాలి సంరక్షిణీహస్త తాళైః కంకణ నాదితైః।
త్రాసితాః కిల గచ్ఛన్తి యత్కీరా స్తద్గిరా జితాః॥

౪. రసాలసాల హింతాల తాలకేతకకాననే।
కాంతారే యత్ర కాంతానాం జాతః శృంగార సంగరః॥

౫. రాసాలహాలాగంధేన మదే నాంధీకృతా దృశః।
అలీనాం యత్ర హా హంత లక్షయన్తి న గేహినీః॥

౬. గతాని హాలికస్త్రీణాం శిక్షయన్తి నిజైర్గతైః।
నేత్రాణి నేత్రై ర్హంస్యశ్చ హరిణ్యశ్చ యదంతరే॥

౭. శంఖకంకణజాలస్య లలనాకరసంగినః।
క్వణేన యత్ర నాదేన కలహంసా శ్శతం జితాః॥

౮. లక్ష్యంతే యత్ర నిచితా లక్షశః శాలిరాశయః।
గేహాంకణే యథాకాశే తటి త్కాంతిధరా ఘనాః॥

౯. హాలికస్త్రీకటాక్షాణాం కాన్త్యా గళిత చేతనాః।
నజానన్తి కృషిం యత్ర కేచి త్కర్షకనందనాః ॥

౧౦. ఖిలా శ్యామలీనతాం యాన్తి యత్ర కంటక రక్షితాః।
కడంగరీయనికటనిరాఘాటకటిస్థలాః॥

౧౧. కదళీకాననే యత్ర హరితచ్ఛదహారిణి।
కీరా నిరంతరం యాన్తి నిజజాతీయశంకయా॥

౧౨. హాలాః కలన్త్యస్సతతం యత్రత్యా త్సహకారతః।
నిర్దిశన్తి నిరాతంకం నర్తనాయై శిఖండినః॥

౧౩. యత్ర కాంచనసంకాశా రసాలానాం రజః కణాః।
టంకఘృష్టస్య తరణే ర్వృథాలేశా శ్చకాసతి॥

౧౪. కర్షకస్త్రీకేశహస్తై ర్హస్తాళీసంయుతైః।
న హతార్తా యత్ర ధత్తే శంకాతంకం శిఖండినీ॥

౧౫. నగరాణి గరీయాంసి నాకి రమ్యాణి లక్షశః।
స్థానీయానాం సహస్రాణి యత్రత్యా న్యతిశేరతే॥

౧౬. న నందనం చైత్రరథం న చ యత్ర నిరీక్ష్యతే।
కాంతారం నందనం కృత్స్నం కృత్వా శ్చైత్రరథాహ్వయాః ॥

౧౭. కరిణః కరిణీ సక్తా యత్ర సంశ్రితతారకాః।
సకళత్రాన్ శంకయంతే గాత్రాహీనా న్గజాననాన్ ॥

౧౮. నిచయై రాస్తృతాసీలై శ్శతశః స్యందనా ఘనాః।
నందంతః కింకిణీజాలై ర్వృథా కాంతై స్తటిద్గణైః॥

౧౯. తటాకా యత్ర శతశః సారణ్యాశ్చ సహస్రశః।
సరిన్నాథా న్దర్శయన్తి తేషాంచ కిల గేహినీః॥

౨౦. ఆదిత్య ఘృష్టి సంకాశా దృశ్యన్తే యత్ర గృష్టయః।
క్షీరం దదత్యక్షి కృత్స్నానాం త్రిజగ త్యఘనాశికాః॥

౨౧. ఏకా స్త్వేకశిలాఖ్యాత్ర నగరీ యా గరీయసీ।
సాగరాన్తాం ధరాం కృత్స్నాంశ్రితా కాంత్యా నిరీక్ష్యతే॥

౨౨. కళా గిరః కృశాంగీణాం రశనాః కింకిణీఘనాః।
యత్రాంగదాని చాంఘ్రీణాం నిద్రాహాన్త్యేకిలి శ్రియః॥

౨౩. చంద్రశాలాసంశ్రితానాం చంద్రాస్యానాం నిరంతరైః
యత్రాస్యచంద్రై ర్గగనే చంద్రజ్ఞానం న శక్యతే॥

౨౪. ఇన్ద్రనీలై శ్చంద్రకాంతై స్తథాయత్ర నిరంతరైః।
అంధకారా శ్చంద్రికాశ్చ దర్శయ న్త్యేకదాగృహాః॥

౨౫. కాంతయా ఘ్నన్తి యత్కాంతాః కాంతానాం హృదయం దృశా।
కాంతయా ఘ్నన్తి యత్కాంతాః కాంతానాం హృదయందృశా॥
(వారివారి సుందర దృక్కులతో ప్రియురాండ్రు ప్రియులను, ప్రియులు ప్రియురాండ్రను మోహపఱచుచుండిరని అర్థము.)

౨౬. కళిందకన్యాలహరీసంఘరింఘణహారిణః।
కటాక్షా యత్ర నారీణాం కృష్ణయంతి న కిం జనాన్॥

౨౭. హేలారయేణ తరళా యత్రారాళదృశాం దృశః।
ఖడ్గలేఖా దర్శయన్తి రతినాథకరశ్రితాః॥

౨౮. అధరా యత్ర నారీణాం సకళా నధరీకృతాన్।
ఆఖ్యాన్తి నలినశ్రేణీః కటాక్షాశ్చ కటాక్షితాః॥

౨౯. తర్జయన్తి యత్ర నార్యః కరకంకణరింఖణైః।
ఆక్రీడదీర్ఘికాహంసీ ర్గతితస్కరతాంగతాః॥

౩౦ కర్ణికారత్నకిరణసంకీర్ణహరిదంకనాః।
ఆకర్ణయన్తి సంగీతం కృతశ్లాఘం యదంగనాః॥

౩౧. కర్ణ కల్హారకలికాహాలాశీకరలేహినః।
యత్రాళిన స్త్రాసయన్తే కాంతాః కటక ఝంకృతైః॥

౩౨. కటాక్షకాన్తికళయా హాసచంద్రైః కళంకితైః।
న హాసయన్తి నాథానాం హాసాన్ యన్నలినేక్షణాః॥

౩౩. లలాటే నార్ధచంద్రేణ కృత్స్న చంద్రై స్తదాననైః।
యదంగనాః కళాసక్తి ర్నిర్దిశన్తి నిజార్జితాః॥

౩౪. కనీనికాకళంకిన్యా కాన్తి చంద్రికయా స్త్రియః।
ఆహారయన్తి యత్రత్యా శ్చంద్రికాహారిణః ఖగాన్॥

## II తెలుగు శాసన సాహిత్యము

కాకతీయరాజ్యారంభముతో దెలుగుదేశ రాజకీయచరిత్రతో బాటు తెలుగువాఙ్మయచరిత్రలోగూడ నొక నూతనాధ్యాయ మారంభమయ్యెను. క్రీ. శ. 1160 నాటికి తెలుగుదేశములో నధికభాగము కర్ణాటరాజుల యధికారమునుండి, చోళుల యధికారము నుండి విముక్తినొంది ప్రాంతీయాధిపతుల యేలుబడిలోనికి వచ్చెను దీని ప్రభావము తెలుగుభాషపైన వాఙ్మయముపైన విశేషముగ గనుపించ మొదలిడెను. ముందుగ నప్పటివఱకు తెలుగు-కన్నడ లిపియనబడు సామాన్యలిపి రెండు ప్రత్యేకలిపులుగ రూపొందెను. కన్నడ శాసనములు తెలుగునాట నంతగా కానరావు. అప్పటివఱకు తెలుగు-కన్నడములతో సామాన్యముగ వాడబడుచుండెడి కొన్ని పదములుగూడ విడిపోయినవి. ఇది యొక విధముగ భాషలు విడివడు సంధికాలము. పలువురు విద్వాంసులు సంస్కృతము, తెలుగు, కన్నడములలో వైదుష్యము నార్జించి సమాన పాటవముతో నాభాషలయందు రచనలు జేయనేర్చి యుండిరి.

సాధారణముగ నాకాలములో వ్రాతయందుండు అలవాట్లు పెద్దగా మార్పు చెందలేదు. ఉదా. ప్రవిత్తి; ప్రిప; ఇత్యాది రూపములుగ ఆనాటి విద్వాంసుల

సైతము వ్రాయుచుండెడివారు రేఫకు పరమందును, అనుస్వారమునకు పరమందును ఉండు హల్లులు ద్విగుణీకరించబడును. ఉదయించె ననుటకు ఉదియించె, తనయుడు అనుటకు తనెయుడు, పౌరుషము అనుటకు పౌర్షము, వర్షము అనుటకు వరుషము మున్నగు వ్రాతలు గలవు. పూర్ణానుస్వారమును ఛందోభంగమైనను అట్లే వాడుచుండిరి. ద్రుతము ను 'ను' అని గాని 'ని' అని గాని అజంతముగ వాడుచుండిరి.

కాకతీయులకాలములో సాహిత్య దృష్టితో బరిశీలించవలసిన సంస్కృత శాసనముల కంటె తెలుగుశాసనములు తక్కువ. రెండవ ప్రోలరాజునాటి మాటేడు శాసనములో కొన్ని తెలుగు పద్యములు రచింపబడియున్నవి కాని అవి సాహిత్య దృష్టిలో నంతగా జెప్పదగినవికావు. రుద్రుని కాలములో క్రీ. శ. 1175 నాటి బెక్కల్లు శాసనము కావ్యదృష్టితో రచింపబడెను. ఇందలి గద్య కూడ నతిసుందరముగ నుండును. గంగాధరమంత్రి వేయించిన శాసనము గూడ కావ్యశైలిలో రచింపబడెను. గణపతిదేవుని కాలమునకు జెందిన ఉప్పరపల్లి శాసనము గద్యపద్యములతో గావ్యశైలిలో గలదు. ఈ కొలది యుదాహరణములు ఇచట జూపబడెను.

## 17. మాటేడు శాసనము

చాళుక్య విక్రమ వర్షము 45, (క్రీ. శ. 1120)
వరం. జి. శా. పుటలు 66-67.

కాకతీయులదని చెప్పదగిన మొదటి తెలుగు గద్యపద్యాత్మక శాసనమిది. ఇందు కాకతి రెండవ ప్రోలరాజు బంటు వేమబోల బొడ్డమ మల్లెనాయఁడు ఇప్పటి మహబూబాబాదు తాలూకాలో జేరియున్న మాటేడు గ్రామములో ఈశ్వరునికి, నారాయణునకు, ఆదిత్యునికి త్రికూటాలయము నిర్మించి, ఆ దేవరల పూజా నైవేద్యముల కొఱకు కొన్ని వృత్తులొసగుట యిందు జెప్పబడెను. ప్రాసంగికముగ ఆమల్లెనాయకుని తండ్రితాతలది తనది ప్రశస్తి యిందు పద్యములలో జెప్పబడెను. పద్యములలోకూడ నిది రచింపబడె ననియేగాని కావ్యలక్షణములని చెప్పదగిన విశేషము లేమియు నిందు గానరావు. ఇంద్రాచలధీరుడు, యాచక కల్పవృక్షము, సురభూరుహమూర్తి ఇత్యాది సామాన్య ప్రయోగములు మాత్రమిందు గనుపించును.

శా. శ్రీవాణీ ప్రియు డాదికర్త త్రిజగత్సేవ్యుండు పుట్టించె భూ
దేవ క్షాత్రవైశ్య[1] శూద్రుల మహాతేజంబుతో వారలం
గావంబూని పులింద వంశరుల గల్పించె దద్వంశజు
డావిర్భూత యశుండు బూచన సుపుణ్యాత్ముండు పుట్టెను మహిని

ఉ. ఏచి పరాక్రమంబున సహింపక యన్నదగోటమల్ల డిం
ద్రాచలధీరుడై పగఱ నాజి జయించి విశేషలీలతో
నాచక[2] కల్పవిక్షుండన నాద్యుల కంటెనుం దానె పెద్దయై
బూచన వేమబోలకులభూషణుండై పరగెను ధరిత్రిపై.

ఉ. బూచన కిష్టశిష్ట సురభూరుహమూర్తికిం బుట్టి రాత్మజులు
గీచకవైరి విక్రముండు గిల్పిషదూరుడు రాముండును మహేం
ద్రాచల ధీరుండప్పండు భటాగ్రణిరేవండు దాని దండి యీ
నాచండన బుట్టి రంబుధులు నాలుగుంబోలె ధరాతలంబునను.

చం. అతుల గుణాఢ్యులై పరగు నందఱలోం జడి సన్న బేతభూ
పతినిజరాజ్యవర్ధనుండు బాహుబలంబునంజేసి భూమి సం
తతమునుం గప్పముల గొని[3] బుధప్రియుడై జయశాలి రేమం డూ
ర్జితు (దగు) వేమబోలకుల శేఖరుండు త్తమ దాని దండియై.

## 18. గూడూరు శాసనము

చాళుక్య విక్రమ వర్షము 49, (క్రీ.శ. 1124)
వరం. జి.శా. పుటలు 81, 82.

పలువురు విద్వాంసుల దృష్టి నాకర్షించిన ప్రసిద్ధశాసనమిది. జనగామ తాలూకా గూడూరు గ్రామములో నొక శిలాస్తంభముపై మూడువైపులు

1. 'దేవ క్షత్రియ వైశ్య' అని చదువవలెను.
2. 'యాచక' అనుటకు 'ఆచక' అని ప్రయోగించెను.
3. 'సంతతమును గప్పముల్గొని' అని చదువవలెను.

కన్నడభాగమును, ఒకవైపు తెలుగు భాగమును గలవు, ఈ తెలుగు భాగములో మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు గలవు. కన్నడ, తెలుగు భాగములు మొత్తమొకే కాలమునకు జెందినవి. రచయిత రెండు భాషలు నేర్చి కవిత్వము జెప్పగల యొక సామాన్య కవి. కన్నడ భాగము నందలి చరిత్రయు, రచనయు సులభ గ్రాహ్యముగను దోషరహితముగ నున్నవి. కాని తెలుగు భాగములో నవిరెండును దుర్గ్రాహ్యముగను దోషయుక్తముగను నున్నవి. విరియాల వంశమునకు జెందిన మల్లన యనువాడు తనపేర గూడూరులో మల్లేశ్వర దేవుని ప్రతిష్ఠించి యాదేవుని పూజానైవేద్యముల కొఱకు తానొక తటాకమును, తన స్వామియగు సావిపయ్య దండనాయకునిచేత చాలుక్య ప్రభువు అనజ్ఞతో బమ్మెరగ్రామ దానమును జేయించెను. ఆ సందర్భమున తన తాతముత్తాతల గొప్పతనమును కన్నడ పద్యములలో కొందఱిది, తెలుగు పద్యములలో కొందఱిది వ్రాయించెను. కన్నడ భాగము బాగున్నను, తెలుగు భాగము మాత్రము మల్లన చెప్పిన విషయములను సరిగా గ్రహించలేకనో, సరిగా రచించలేకనో కవి తప్పులతో వ్రాసినట్లు తోచును. కావ్యమున కుండవలసిన రమణీయార్థ ప్రతిపాదకత అంతగా లేదనవచ్చును. ఉదాహరణకు—

ఉ. భావితకీర్తినా [దనరు] పాండవ మధ్యమభీముడో యనం
గా విర్థియాల్లు భీము నృప ఘస్మరుడై యుదియించె వానికిను
భూవినుతుండు షండశిక భూషణుడెఱ్ఱ నరేంద్రుడుత్తమ
శ్రీవినుతుండు బంధుజనసేవ్యుండు దానుదయించె మన్నతిని॥

ఇందు పాండవమధ్య భీమునితో విరియాల భీముని బోల్చును. కాని 'భీమ' అని ప్రాతిపదికనే యథాతథముగ 'హం' యిత్యాది ఇకారాంత ప్రాతిపదికలవలె తెలుగున ప్రథమాంతముగ ప్రయోగించెను. 'ఉదయించె', 'ఉదియించె' అని రెండు విధములుగ ప్రయోగించెను. మిగిలిన నాలుగు పద్యములు కూడ నిట్లే యేకొంత చరిత్రాంశమును దెలుపునేకాని ఆ కాలపు తెలుగు కావ్యశైలికిది యుదాహరణము కాజాలదు. కాకతి మొదటి బేతరాజుయొక్క ప్రసక్తి యీ శాసనములో గలదు గనుక చారిత్రక దృష్టిలో నిది ముఖ్యమైనది.

గూడూరు శాసనమునందలి యితర తెలుగు పద్యములు:

1.చం. అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి ననేకులు రాజనందనులు
సనిన బొఱంటివెన్న దనుసంభవుడయ్యె నతిప్రసిద్ధుడై
వినుతవిరోధి మండళికవెన్నడు వెన్నుడై పోలె వానికిని
ఘనుడగు నెఱ్ఱభూపతి జగద్వినుతుండుదయించె గీర్తితోను॥

2.ఉ. 'భావితకీర్తి' యను పద్యము ముందుదహరించబడెను.

3 చం. అత డ్డని బొట్టుబేత వసుధాధిపు జేకొని వానివైరి ను
ద్దిగి (ద్ధగి) తమున జంపి యా కొరవిదేశమునందు ప్రతిష్ఠజేసి త
త్తనె (న) యురు పేరు పొడగలదాయము బిట్టుజగద్యనంబు న
ప్రతిముడు వానిచే మొగడుపల్లియు పంద్రడు నేలునప్పుడే॥

4.చం. అరుదగునట్టి ఎఱ్ఱ నృపు నంగన గామవసాని యొక్కమే
ల్గయండని బేతభూవిభుని గాకతి వల్లభు బిన్నవాని దా
బరగంగ జేతబట్టి ఘను బల్లవరాయ నియోగిజొచ్చి భా
స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట గోటిసేయదే॥

5 ఉ కారకకాలుడై వడసె గాడయనాయకు జంపి సూరడ
వ్వేలుపుగొండ రవ్వెనిపు వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడు ముప్పయిని మేలుగ నేరెకు బోటిపాడునుం
మేలుగ బెక్కు మావిడ్లు మేలు గరెండెయరాజు సంగడ్లు॥

సూత్రధారి కొమ్మోజన బరహ శ్రీశ్రీశ్రీ
అదపగట్టు దేవరకు జను

ఈ యైదు తెలుగు పద్యముల తరువాత 'సూత్రధారి కొమ్మోజన బరహ' అను కన్నడ వాక్యము ఆ తరువాత 'శ్రీశ్రీశ్రీ అదపగట్టు దేవరజకు ను' అనుతెలుగు వాక్యముతో శాసన స్తంభము నాలుగవ వైపునగల తెలుగు భాగము ముగియును. మిగిలిన మూడు వైపులు పూర్తిగ కన్నడ శాసనమే కాని తెలుగు కాదు. నాలుగవ వైపున తెలుగు పద్యముల తరువాతనే శాసనముత్కీర్ణము జేసిన

సూత్రధారి కొమ్మోజు పేరు గలదు. అదియు కన్నడములో నుండటనుబట్టి ముందున్న కన్నడ భాగము నుత్కీర్ణము జేసిన కన్నడపు ఓజు, ఇతడు ఒకరే నని వ్యక్తమగుచున్నది. శాసనలిపి కూడ నాలుగువైపుల నొకచేతితో గండ రించినట్లున్నది కాని రెండు విధములుగ లేదు. కనుక స్తంభము నలువైపులు కొమ్మోజే మలిచెనని స్పష్టము. అదియునుగాక తెలుగు భాగమున ప్రశస్తి పద్యములు, ఓజుపేరు, దానముచేసిన అడపగట్టు చెప్పబడెను కాని ముఖ్యమైన దానకర్తపేరు, తేది, తుదకు దేవుని పేరు చెప్పబడలేదు. దానకర్త పేరులేని శాసనములుండవు. అందును ప్రశస్తిపూర్వకముగ నుండుట యసంభవము. ఈ కారణములచే తెలుగు భాగమును కన్నడభాగమునుండి వేఱుచేయలేము. కనుక కన్నడ శాసనకర్త యగు విరియాల మల్లనయే తన పూర్వులను గూర్చి యీ తెలుగు ప్రశస్తినిగూడ నదే కన్నడ కొమ్మోజు చేత ఆదేశింపపై నాలుగవవైపు వ్రాయించెను. ప్రధాన శాసనము కన్నడములో మూడు వైపులలో బూర్తియైన పిదప నాలుగవవైపు ఖాళీగా మిగిలిపోయెను. మల్లనకప్పుడు ఆ వైపునుగూడ వ్రాయించిన బాగుండునని తలంపుగలిగి ఆ కన్నడ కవిచేతనే తన పూర్వుల గూర్చి తనకు తెలిసిన సమాచారము చెప్పి తెలుగులో పద్యములు వ్రాయించెను. ఆ కవి ఆ సమాచారమునంతను సరిగా తెలుగు పద్యములలో కుదించలేక మనకీ యవస్థ తెచ్చిపెట్టెను. అంటే సరిగా అర్థముకానట్లు వ్రాసెను. ఇంతకు పర్యవ సానమేమనగా, కన్నడ శాసనములోని చాళుక్య విక్రమవర్షము 49,కి సరియగు క్రీ.శ. 1124 వ సంవత్సరమే యీ తెలుగు పద్యముల కాలముకూడ అగును. వేఱొండు సంవత్సర మీ తెలుగు భాగములో లేదు. విరియాల మల్లనయే దీనిని కూడ వ్రాయించెను. కన్నడ కొమ్మోజే దీనినికూడ గండరించెను. కవిపేరు కన్నడములోను లేదు. తెలుగులోను లేదు. ఆ మల్లనయే ఆ మల్లేశ్వరదేవునికే ఆ యూరిలో తనకు జెల్లుచుండు గ్రామ కట్నతాంబూలము (అడపగట్టు) దాన మొసగెను. ఇట్లు చెప్పనిచో తెలుగుభాగమునకు దానకర్త లేకపోవలసివచ్చును.

కనుక గూడూరు శాసనములోని తెలుగుపద్యములు సుమారు క్రీ.శ.1000 నాటివని కొందఱు విద్వాంసులు చెప్పుచుండుట ఆధార రహితము. అందలి చరిత్రాంశములు మటుకు అప్పటివే శాసన రచనాకాలము క్రీ.శ. 1124 గాక వేఱొండు కాజాలదు. అట్లే యిందలి తెలుగు పద్యములు ఆనాటి (క్రీ శ 1124

నాటి) తెలుగు పద్య రచన కుదాహరణము కాజాలదు. కన్నడకవి తనకొచ్చిన తెలుగుతో పద్యము లల్లి చరిత్రలోను, భాషలోను తప్పులు వ్రాసెను.

1. మొదటి పద్యమున దుర్జయుం గు కాకతీయ వెన్నన్నృపతిని, యెఱ్ఱనృపతిని చెప్పినట్లు తోచును.

2. రెండవ పద్యములోనే విరియాలవారి ప్రసక్తి గానవచ్చుచున్నది. పై పద్యముతో దీనికి సంబంధము తెలుపలేదు.

3. 'విరియాల భీమ నృపమస్మరుదై' యనుచోట 'భీమ' అని ప్రాతిపదిక మాత్రమే ప్రథమాంత తత్సమముగా వాడబడెను.

4. మూడవ పద్యములో 'తత్తనెయురు పేరు పొదగల దాయము బిట్టబ గద్యనంబు' అనుదానిలో 'తత్తనయుని పేరు' అని యుండవలెనేమో తెలియదు. అట్లే 'యెఱగద్యాణము' లో లేక 'అర్ధగద్యాణము' లో తెలియదు.

'మొగదు పల్లియుపంద్రదు' అను చోట ఈకారాంత ప్రాతిపదికను మామూలుగ 'పల్లి' యని హ్రస్వాంతముజేసి దానికి తెలుగు ప్రథమ 'ఉ' జేర్చి 'పల్లియు' అని రూపొందించెను. పనియు, గుడియు, స్థితియు అను ప్రథమైక వచన ప్రయోగములు 'ఉ' ప్రత్యయాంతములుగ నన్నయకు బూర్వము తెలుగు శాసనములందు గానవచ్చును. సముచ్చ యార్థకముగ వాడినది యీ 'ఉ' కాదు. అట్లగుచోనది 'పంద్రదును' అని తుదిలో నుండవలెను. మొగదు పల్లితో గూడిన పంద్రెండు గ్రామ ములను నర్థములో 'పల్లియు పంద్రదు' - 'పల్లియు' ప్రాచీన పద్ధతిలో 'ఉ' ప్రత్యయాంతముగను, పంద్రదు' అనుస్వారరహితముగను వాడెను.

5. 'గరుడ' అను ప్రాతిపదికను 'గరుడయ్య' అను నర్థములో 'గరెండెయు' అని 6 వ పద్యములోను, 'గరుడుండు' అనుటకు 'గరుండు' అని 4 వ పద్యములోను వాడెను.

6. 'భాస్కరవిభు' లేక 'భాస్కరనిభు' చక్రవర్తి పేరెద్దియో తెలుపలేము.

7. ౯వ పద్యం చివర 'సంగడుల్' అనుటకు బదులు 'సంగడ్లు' అని ఛందో భంగముగ వాడెను.

ఇంచుమించుగ నదేకాలమునకు జెందిన నాదెండ్ల శాసనములోని యీ దిగువ పద్యము ఆనాటి తెలుగు కవిత్వమునకు ఉదాహరణముగ జెప్పవచ్చును.



ఉ॥ శ్రీరమణీలలాముడు వశీకృతవీరవిరోధి హారని
హారసరోజరాజహరహాసయశోనిధివందిబృందమం
దారుండ సౌర విభ్రమ జితస్మరమూర్తి సతుర్థవంశని
స్తారకుం డెట్ట మందండు బుధప్రణతుండుదయించె వానికిని॥
(శాసన పద్యమంజరి-10)

అట్లే శకము 1054 (క్రీ.శ. 1132)నాటి నిడుబ్రోలు శాసనములో సీసపద్యము-



సీ॥ లాట విలాసినీ లాలాట తిలకునిం
గేరళీకరలగ్న కేలిపద్మం
గర్ణాట సుందరీ కర్ణావతంసునిం
గున్తలీ కున్తల కుసుమదాము
గౌడసతీనేత్ర కాలాంజనుని నంగ
భామా కపోలా ప్తపత్రరచను
నేపాల కామినీ నీరంధ్ర కచహారు
సంధ్రీతనూకుంకుమాంగరాగు

రమణతో నది దానుల రాసి కెక్క
దీనజనముల యడతెల్లం దీర్చుచున్న
యనఘ చారిత్రు మారపండ నిన తగిలి
పొగడవిందుము నెల్ల భూభుజుల సభల. (శాసన పద్యమంజరి-11)

ఈ పద్యము కవిగా ప్రసిద్ధిగొందిన వాడుగాకున్నను రాజుల స్తోత్రము చేయు వంది వర్గములో నొకని రచన గావచ్చును. అలవాటు చొప్పున వారు కూడ మంచి పద్యముల నచ్చటచట చెప్పుచుండెడివారు.

శకము 1093 నాటి సిరిపుర శాసనములో-

మ. హరహాసేన్దు తుషార శారద సితాభ్రైరావతో చ్చైశ్శ్రవాం
బరదుగ్ధాబ్ధి సురాపగాంబు రజతప్రఖ్యాత కీర్తి ప్రభం
గరమొప్పను సహకార వల్లభ శ్రీపౌఘశ్లేష్మ గొంక క్షితీ
శ్వరసూనున్ వెలనాంటి చోడి జనపున్ సామాన్యమే పేర్కొనన్॥

ఇందు వెలనాటి గొంకక్షితీశుని కీర్తి కవి సమయములో ప్రసిద్ధములైన కేల్లని వాటితో పోల్చబడెను.

## 19. గంగాధరమంత్రి నగునూరు (కరీంనగర్) శాసనము

శ. 1092 (క్రీ. శ. 1171); (కరీం జి. శా. పుటలు 64-70)

రుద్రదేవుని మంత్రిగా ప్రసిద్ధి నొందిన వెల్లకి గంగాధరుడు రాచకార్యము లందే గాక సారస్వత విషయములలో గూడ గొప్పవాడని తెలియుచున్నది. వాని సంస్కృత శాసనములు కొన్ని అనుమకొండలో గలవు. వాటిని గూర్చి సంస్కృత విభాగమున జెప్పబడెను. అతను స్థాపించిన తెలుగుశాసన మొకటి నగునూరులో లభించగా దానిని కరీంనగరు కలెక్టరు కార్యాలయము వద్దకు జేర్చిరి. ఈ శాసనము చక్కని తెలుగుపద్యములలో గలదు. ఇందు గంగాధర మంత్రి యొక్క ప్రశస్తి అతని సత్కార్యములు కీర్తింపబడెను. అందు కొన్ని పద్యములు జూపబడును. రచయిత పేరు చెప్పబడలేదు కాని, మూడవ పద్యము రెండవ పంక్తి చివర 'ననుం' అని యుండుటచేత గంగాధరుడే స్వయముగ నీ పద్యములు వ్రాసియుండునని తోచును.

శా॥ శ్రీరామాధిపుడింద్రనీలనిభశారీరుం డుదారుండు గౌ
రీరామాధిపుం డుజ్జ్వలస్ఫటికశారీరుండు ధీరుండు భా
షారామాధిపుం డబ్జకేసరలసచ్ఛాయాశారీరుండునుం
గారుణ్యంబున మాకు నీవుత సదాకాలంబుం గామ్యార్థములు.

ఉ॥ భూధరధైర్యు డత్యధిక పుణ్యచరిత్రుం డపారకీర్తి ల
క్ష్మీధరమూర్తి శిష్టజనమిత్రుండు గోత్రపవిత్రుం డచ్యుతా

రాధనతత్పరుఁడు సురరాజగురుండు మతిప్రభా(వ?) గం
గాధరుం డిద్ధరిత్రి ననంగా నుదియించె శుభోదయంబునన్.

చ॥ సకలకలావిధిజ్ఞుం డనంబాలి సమస్తజనాలి సద్గుణ
ప్రకరము నెప్పుడును బుధసభం బ్రణుతింపంగనున్నయట్టి ననుం
బ్రకటితకీర్తిప్రోల జనపాలుఁడు ఘోరతరాజిలోలుండ
త్యకుటిల చిత్తుం డితండని యాదరికం బిల్పించి పంపంగాన్.

ఇట నుండి నాలుగు పద్యములలో కాకతి రుద్రదేవుని ప్రశంసించును. తృతీయాంతములలో జెప్పబడెను.

స్రగ్ధర॥ శ్రీ కాన్తా కాన్తుచే నాశ్రితవిబుధజనాళిస్థిరప్రాజ్యరాజ్య
శ్రీ కాన్తా కాన్తుచే విస్త్రి(స్తృ)తనిజభుజ నిస్త్రింశ నీతాన్య రాజ
శ్రీ కాన్తా కాన్తుచే దిక్ క్షితిగగనసమాశ్లిష్టవిస్పష్ట కీర్తి
శ్రీ కాన్తా కాన్తుచే నూర్జితరిపుమృగరాజీమృగారాతి చేతన్.

చం॥ పరనరపాలమౌళిమణి భాసురదీప్తిలతావితాన వి
స్ఫురితపదాబ్జుచే నహితభూతలనాథవరూథినీసరో
వరమథనప్రభూతమదవ ద్ద్విరదాధిపుచే విరోధిభూ
ధరశిఖరప్రభిన్నవిదితత్రిదశేంద్ర విశాత హేతిచేన్.

కం॥ సురకరిపతి మృగపతి హరి
సురసరిదమల సరసీరుహాశు క్తిరుహ సదృక్
సురుచిరవిశదయశో భా
సురనిధిచే సుకవి ధరణీసురనిధిచేతన్.

కం॥ శరనిధిపరీతధాత్రీ
పరిపాలిత దక్షిణ ప్రభాసిభుజ వి
స్తృతచేత నన్మకుండా
పురనాథుండైన రుద్రభూపతి చేతన్.

చం॥ వెలయ నమాత్యసంపదయు విశ్రుతమైన నియోగవిత్తు లం
దలము శితాతపత్రము లతర్క్య విభూషణలేపనాంబరం
బులుం దగు ప్రిత్తులుం బడసి భూసురవర్గముం బ్రోచి దేవతా
నిలయము లర్థిం జెక్కొనర నిల్పుచుం బూజలు ప్రీతిం జల్పుచున్.

విశేషాంశము:- గంగాధర మంత్రి గొప్ప కవి గాకున్నను ఆనాటి ఆంధ్రకవుల నూతన పోకడలు తెలిసినవాడనిపించును. ముఖ్యముగ రుద్రదేవుని గూర్చి తృతీయాంత పదములతో నితడు వ్రాసిన ప్రశస్తి అప్పుడే తెలుగు కవులలో దలయెత్తుచున్న ప్రబంధాదులలో కృతిపతిని గూర్చి చేయు షష్ఠ్యంత ప్రశస్తిని బోలియున్నది. తిక్కన, కేతనల కాలము వఱకు, అనగా సుమారు క్రీ. శ. 1240 వఱకు తెలుగు గ్రంథాదులలో షష్ఠ్యంతములు వ్రాయుపట్టి ఆచారము కనుపించదని శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారు తమ నన్నెచోడుని గూర్చిన చర్చాగ్రంథమున వ్రాసిరి (పుటలు 30-36). అది యంగీకరించుచో గంగాధర మంత్రి (క్రీ.శ. 1170) చతుర్థ్యంతములతో ప్రశస్తి రచించుటను బట్టి యిట్టి నూతన పోకడలు ఆ కాలములో గలవని తెలియుచున్నది,

## 20. బెక్కల్లు శాసనము

శకము 1097 (క్రీ. శ. 1175-6)
వరం. జి.శా. పుటలు 46-48

కాకతీయులనాటి కావ్యశైలి యనదగిన రచనగల మొదటి తెలుగు శాసనమిది. గద్య పద్యాత్మకము. కాకతిరుద్రదేవుని మండలాధిపతులలో నిప్పటి జనగామ తాలూకాలోని బెక్కల్లు పురము నేలుచున్న మల్లిరెడ్డి ఆ యూరికి కొంచెము దూరములో నున్న శివాలయ కూటమునందు దీపాసునశిలా స్తంభమును స్థాపించెను. దీనిపైన భక్తులు దీపారాధనలు చేయుచుండుటవలన శాసన మంతయు మడ్డిపట్టి యెంత తుడిచినను స్పష్టము కాకున్నది. ఆ కారణమున వరంగల్లు జిల్లా శాసన సంపుటిలో ప్రకటించిన పాఠములో ననేక లోపములు గలవు. ఇటీవల దానిని మఱల తుడిపించి శాసనమూలమును కొంత మెఱుగు పఱచగలిగితిని. మల్లిరెడ్డి యిచట తన తండ్రి, తాతల పేర్లన గుడ్లెత్తించి యీ

శాసనము వేయించెను. ఈ మల్లిరెడ్డి విష్టకులమునకు జెందిన వాడట. వారు జైన ధర్మానుయాయులు శాసనరచయిత పేరు చెప్పబడలేదు.

శాసన మూలము

1. క. శతదళహిత సుతవితరణుం
దతులితనుతశితయశోర్థి యమల చరిత్రు౦
దతిశయగుణములం బరగె వి
జితరిపుండగు మల్లిరడ్డి విష్టకులములోన్॥

2. గద్య. శిష్ట కులంబది యెట్టిదనిన (విష్టకులము, శిష్టకులము అని రెండు రూపములు గనుపించుచున్నవి.)

3. మ. అజుపాదంబులం బుట్టి రాద్యమున విప్రాన్వయముఖ్యుండు ప
ద్మజుండు న్విప్రుల పాదములు శుచులు మేధ్య స్థానజులు గా
నజపాదాబ్జజులు౦ బవిత్రులని నిస్సందిగ్ధబుద్ధిని సమ
స్త జనవ్రాతములుం జతుర్థకులులను శంకింతు రిద్ధారుణిని॥

4. చ. అతుల ఛతుర్థవంశజులయం దతిజీవదయాపరత్వ సూ
త్రితదురితేతరాప్రమితనిర్మలబుద్ధి సమృద్ధి శ్రావక
వ్రతయుతులై విశిష్టులగు వారల వంశము శిష్టవంశమై
వితతసమ స్తభూభువనవిశ్రుతమయ్యె దదన్వయంబునన్॥

5. ఉ. శ్రీరమణీయ్యు డుత్తముం దశేషజనస్తుతనిర్మలోజ్వలా
పారయశస్స్రమిద్ధ (......) ప్రచయుండు సుప్రిజ్ఞనాంబుజాం
భోరుహమిత్రుం డప్రమితపుణ్యధనాఢ్యుడు రేవిరడ్డి పే
రారిమదద్విపేంద్రనఖరాయుధుడై ప్రభవిల్లె నిమ్మహిని॥

6. ఉ. ఆతని నందనుండు విబుధాన్వయకల్పమహీరుహుండు వి
ఖ్యాత యశోనిధానుం డనఘవ్రతశీం(ధ)నుండు శిష్టవం
శాతత వార్ధివర్ధన సుధాంశుండు సూనృతవాక్యు డుద్ధతా
రాతివనానిలుం డుపమపాక్రమతార్క్ష్యుండు చండిరడ్డి దాన్॥

7. చ. అభినవధర్మనందనుం దహర్పతితేజుఁడు నంగునూరివ
ల్లభుండగు రేచిరడ్డికి విలాసరతీశుడు పౌత్రుండైన పీ
తభయుండు పున్నిరడ్డి నిజదానదయాగుణ ధర్మ నిర్మల
ప్రభదురితౌఘసంతమసభాస్వదురుప్రభయయ్యె నిమ్మహిని॥

8. ఉ. వాని తనూభవుండు నిజవంశలలాముండు గల్పవృక్షమను
మ్రానదె నాసమానమని మానుగనర్థిజనాలి నర్థితోం
దానఖిలార్థసంపదలం దనుపుచు నప్రమితప్రతాపియై
శ్రీనిలయుం డమేయగుణి (సీఱ) య ధారుణి నొప్పె జెప్పంగాన్॥

9. క. కులతిలకుం డంద్రుడు నన్నుం
గులజనులని వేడ్కం జిట్టకులతిలకము నా
వెలయంగ బ్రెక్కంటంగరం
బలఘు జినాగారమెత్తె నతిధార్మికుండై॥

10.క. అతని పుత్రుండు శిబిజీ
మూతధ్వజ (—) పజాంగ ముఖ్యులకై నయై
కేతన నిజదానగుణ
ఖ్యాతిమెయిం బరగె బుధ నికాయము వొగడన్॥

11.చ. కమలజమిత్రతేజుండు ప్రకాశితకీర్తి సమన్వితుండు వి
క్రమనఖరాయుధుం డహితకంజవనోన్మదకుంజరుండు స
ద్విమలగుణాభిరాముండు పవిత్రచరిత్రుం డఘౌఘదూరుండు
త్తమ మతి మల్లిరడ్డి గుణధాముండు గేతయ పుత్రుండిమ్మహిని॥

12.చ. తిరుగని మందరాచలము ధీరత బొంకని ధర్మజుండు వి
స్తరతరధర్మమార్గమున దానొరువేండని వాసవుండు భా
సురవిభవోన్నతి న్విమలసోముడు గాంతి నిజేశ్వరాహితే
తరుండగు సూద్రకుండు గుణధాముడు (మించిన) విక్రమంబునన్॥

13.క. పరధనమున కడుపమియుం
ఐరగ నహింసయును బొంకు పలుకమియు నిరం
తరదానవినోదంబును
నరుదుగ బ్రెక్కంటిమైలి (కమ్మడు వడియెంన్)॥

14.ఉ. మంచె న్బాంధవుల న్సమృద్ధముగ సన్మార్గంబునం బ్రోచి ర
క్షించె స్విప్రుల నూర్జితంబుగ నతిస్నేహంబుతోడం బ్రజం
బెంచె న్దేవనికేతనావలు లతిప్రీతిని జనుల్మెచ్చ నె
త్తించెం గీర్తి మహీశశాంకభగణాదిత్యాచలస్థాయిగన్॥

15. గద్య॥ స్వస్తి సమస్తజనస్తుతాతివిస్తరిత నిజనిరంతరాయక్రితత్యాగబోగ దాన ధర్మ సత్యశౌచవిమలజ్ఞానవిజ్ఞానాద్యశేష సద్గుణగణ మణి నిచయ ఖచిత సుచరిత్రాభరణ ప్రచయ ప్రసర రుచిర ప్రజ్వలిత భువనత్రితయుండును। సదారాధిత మూర్తిత్రితయుండును॥ కవిగమకి వాదివాగ్మి నటభట గాయక పాఠకజనాజస్ర పఠిత జగద్విఖ్యాత నానావిధనామాంక మాలికానికరుండును। నిజవిమల యశస్సుధా ధవళిత దిగ్ని(జ్ని)కరుండును। బుర్షార్థ చతుర్వర్గ ఫలసాధనాద్యుపాయ పరిచింతిత నిరంతరాంతరంగచతుష్టయుండును। సముద్ధరిత సమయ చతుష్టయుండును॥ స్వర్ణమహీ గోమహిష వస్త్రాభరణ ధనధాన్య వస్తు వాహనేష్ట మిష్టాన్న దానాప్రమేయ నిజసంతర్పిత భూసురవరాశీర్వాద శత సహస్రానీక ప్రవర్థితాయురారోగ్యైశ్వర్య సంపన్నుండును।నపరిమిత పుత్రపౌత్ర మిత్రగోత్రక్షేత్ర సంపన్నుండును॥ అరిబిరుదరట్టడి శరభ గండభేరుండును। బంధుజన వనజవనమార్తండుండును। జాతి సత్వ రతికళాస్థాన జ్ఞానవివేకపూర్వక సంయమ పక్షాది (సప్తిసవిధ) కరణాసన ప్రయోగ నిజక్రిత సురత సుఖసముద్రావగాహ నానేక చతురవనితా జనహృదయాకర్షణోపాయ ప్రణయ వినయ మధుర క్రియా యంత్ర తంత్ర పరిజ్ఞాతాధఃక్రిత మనోభవుండును। సుభగమనో భవుండును॥ శిష్టకులవార్ధి వర్ధన సుధాకరుండునుం। బతిదేవ గురుద్విజ భక్తి వ్రత రత్నాకరుండును। నైన శ్రీవ్వెక్కంటిపురవరేశ్వరుండు

మల్లిరడ్డి పరమపౌర్ష పురుషోత్తముండై తాం గుణదీపకుండగుటం జేసి తన కులము నిరువది యొక్కొ తలవారికి నిరువది యొక్కొ గుడ్లెత్తించి దేవభోగము నకు దత్తివిడిచి యాచంద్రార్క తారకంబుగా శాసనారూఢస్తంభంబు నిల్పి అభినవమల్లికార్జునంబు పుణ్యస్థానంబు గావించి పుణ్యశ్లోకుండై పరమధర్మప్రతి పాలనంబు సేసెందమ యాన్వయంబనాది సంసిద్ధంబైన జినజైన ధర్మంబునం బ్రవర్తిల్లు చునికింజేసి విమలవిజ్ఞానంబున నూహించి వివేక విద్యాధరుండై॥

16. చ. అమరంగ శైవవైష్ణవనిజారుహబౌద్ధములైన యిచ్చతు
స్సమయములుం బ్రిభజ్మతము సంశయహేతువు దైవమెల్లనే
కమయని యైక్యభావమునం గల్మషహరుండు మల్లిరడ్డి య
త్యమిత గుణాఢ్యుం డీయతులితా యతనంబులు నిల్పెం బ్రీతితోన్॥

17. క. కులగిరులుం జంద్రతారలుం
గలయంతకుం ధరణి ధరణి కలయంతకు ది
క్కులం బర్వి మల్లిరడ్డి వి
పుల ధర్మము (యర) గెడం ద్రిభువనములందున్ ॥
మంగళమహా శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

విశేషములు:- నన్నయభట్టారకుని తరువాత సుమారు రెండు శతాబ్దు లాంధ్రవాఙ్మయచరిత్రలో గణనీయమగు రచనలు తక్కువ. నన్నెచోడుని కాలమును గూర్చి వాదోపవాదము లింకను సాగుచునే యున్నవి. క్రీ. శ. 12 వ శతాబ్దివాడని నిశ్చయముగ జెప్పబడుచున్న మల్లికార్జున పండితారాధ్యుని శివ తత్త్వసారాది గ్రంథములు దక్క వేరొండు రచన ఆ కాలములోనిది తెలియదు. కొన్ని శాసనములందు మాత్రము గద్య పద్య రచనలు గానవచ్చునుగాని అవి యన్నియు సాహిత్య వాఙ్మయములో జేర్చదగియుండవు. వ్యక్తుల పేర్లు, శకవర్షాదులు, తటాకాదులు త్రవ్వించుట, దేవాలయములు గట్టించుట, దానము లొసగుట మున్నగు విషయములను ఛందోబద్ధముగ పద్యములందో లేక వచ నముగనో వ్రాసినంతమాత్రాన అది కావ్యరచన యనబడదు. ఈ బెక్కల్లు శాసన మట్లుగాక కావ్యశైలిలో రచింపబడెను. రచయిత పేరు చెప్పబడలేదు.

అతడొక విద్వాంసుడని తెలియుచున్నది. ఆనాటి నన్నయ భారతమును జూచి యుండును. కాదంబర్యాది సంస్కృత గద్య కావ్యములు తెలియకుండ నిందలి గద్య రచన చేసియుండడు. నిజమునకది పూర్తిగ సంస్కృతపదభూయిష్ఠమైన దీర్ఘసమాసములతో నున్నప్పటికిని మల్లిరెడ్డిని గూర్చి రచయిత కావించిన స్వతంత్ర రచనయేగాని సంస్కృత కావ్యముల నుండి గ్రహించినదికాదు. పద్య భాగమునందు సామాన్య మాండలికుని ప్రశస్తిలో నుండవలసినంత యౌచిత్య మును పాటించెనే కాని అభూతకల్పనలతోను అతిశయోక్తులతోను వర్ణన చేయలేదు దేశిఛందస్సులో నొక కందపద్యములు దప్ప వేఱొండు ఛందస్సును వాడలేదు. సంస్కృత ఛందస్సులలో మత్తేభము, చంపక, ఉత్పలమాలలు మాత్రము వాడెను. 8 వ పద్యాంతమున 'ధారుణి నొప్పె జెప్పగాన్'; 13 వ పద్యములో (అస్తేయము), అహింస, సత్యము, దానము 'వ్రెక్కంటిమైలి కమ్మడువడియెన్' అని చక్కని తెలుగు ప్రయోగములు గమనించదగి యున్నవి చాలా పద్యముల జివర ఇమ్మహిని, ఇద్ధారుణి అనునవి కొంత విసుగు కలిగించును. వర్ణనల సందర్భమున సంస్కృత సమాసములైనను చిన్నవిగను, సులభగ్రాహ్యములగు రూపకములతో పద్యమునకు చక్కని రీతి నిచ్చుచుండును. (ఉదా. 6, 7, 11 పద్యములు.) మొదటి కందపద్యములో అనుప్రాస చదువ కింపైయున్నది. 8 వ పద్యములోని కల్పవృక్షోపమానము సామాన్యమైనప్పటికి రమ్యముగ జూపట్టును. 12వ పద్యములో విశిష్టరూపకము. ఇవి పోగా మిగిలిన యుపమానములన్నియు నధికముగ రూపకసమాస పదముల తోనే జూపబడెను. కవిత్వమందు ప్రౌఢత లేకున్నను రమణీయతకు లోటులేదు. గద్యభాగము దీర్ఘసమాసములు, వెంటనే అంత్యయమకముతో హ్రస్వసమాస ములు సంగీత పదవిన్యాసము ననుకరించుచుండును. మొత్తమున ఆనాటి తెలుగు కావ్యశైలికిది యొక ఉదాహరణము కాగలదు.

## 21. మొరిపిఱాల శాసనము

శకము 1103; (క్రీ.శ. 1181)

వరం. జి. శా. పుటలు 108-110

ఆ కాలపు శిష్టవ్యావహారిక మనదగిన వచనములో నీ శాసనము వ్రాయ బడెను. దీనిని కావ్యమనజాలము కాని, జనసామాన్యము వ్యవహారపత్రాదుల

వ్రాసుకొను చక్కని భాషలో రచింపబడెను. రచయిత మల్లపరాజు అను విరియాలవారి కరణము. శాస్త్రజ్ఞుడు కాని, విద్వాంసుడుకాని కాకపోవచ్చును. కాని సామాన్యులు చదువుకొను భక్తి గ్రంథములు జదువుట వలననేర్పడిన పరిజ్ఞానము గలవాడు. తిక్కన భారతము కాని, పోతనామాత్యుని భాగవతము కాని అప్పటికింకను పుట్టలేదు. రంగనాథ రామాయణము కూడలేదు. మఱి యే తెలుగు గ్రంథము లానాడు సామాన్యులు జదువుకొనుచుండెడివారో తెలియదు. కాని అప్పటి విద్యావిధానములో వీథిబడులందు బాలబాలికలకు ఇట్టి చక్కని తెలుగు వ్రాయనేర్పెడి వారని దీనిని బట్టి తెలియుచున్నది.

**శాసన మూలము నుండి కొంత భాగము :**

స్వస్తి శ్రీర్జయాభ్యుదయశ్చ । శకవర్షములు ౧౧౦౩ ప్లవ సంవత్సర మాఘ సుద్ధ ద్వాదశి సోమవారమున మేషలగ్నము పునర్వసు నక్షత్రమః నవ గ్రహములు యేకాదశస్థులై ఉండంగా ......... జన్మించిరి వారిలోనం ప్రోలిరెడ్డి అత్యంత ధర్మపరుడును అధికపుణ్యాధికుండునునై జన్మించి తనకుం బరమ పతివ్రతయైన మాచమాంబిక ధర్మపత్నికాంజేకొని వంశకరులైన సుపుత్రులంబడసి ధర్మార్థ కామమోక్షంబులను చతుర్విధ పురుషార్థంబులంద చిత్తంబు నిలిపి క్రితయుగ త్రేత ద్వాపర కలియుగంబుల స్థిరంబైన దైవంబీశ్వరుండ తనకుం బరమ శ్వామినిగాం దలంచి చతుర్దశ భువనాధీశ్వరుండును, నంది వాహనారూఢుండును పార్వతి మనోన్నయన వల్లభుండును శ్రీరామ రావణ ధనంజయ వరప్రసాదుండును నారాయణ ప్రియుండును గౌరీకుచకలశ కుంకుమ చందన పంకాంకిత వక్షస్థలశరీరుండునుం త్రినేత్రుండును శ్రీకైలాస నివాసుండైన ప్రోలేశ్వర దేవరకు ప్రతిష్టసహితంబుగా దేవాలయంబు లెత్తించి భాగీరథి సమానంబుగా బావి మెప్పించె (?) యిందు స్నానము సేసి పాప విముక్తులగుదురు. .................. విరియాల యింట కరనముగా ప్రోలిరెడ్డి నిల్పిన / మల్లపరాజు వ్రాంత.

## 22. ఉప్పరపల్లి శాసనము

శకము 1157 (క్రీ శ. 1236)

కరీం. జి శా. పుటలు 89-92; శాసన పద్యమంజరి - 59.

గణపతిదేవుని కాలము నందలి తెలుగు శాసనములలో నిది ముఖ్యమైనది. అచ్చ గ్రాంథిక భాషలో కావ్యశైలిలో నిది రచింపబడెను. రచయిత బేర్కొన

బడలేదు. గణపతిదేవుని ముఖ్య ప్రధానులలో నొకడగు రేచర్ల రుద్రిరెడ్డికి మంత్రియగు రాజనాయకుని పుత్రుడైన కాటనాయకు డీగ్రామములో శివాలయములు, తటాకములు ప్రతిష్ఠించి దేవబ్రాహ్మణవృత్తులు విడిచి పించరపల్లి దానము చేయుచు ఈ శాసనము వేయించెను. అందు కాకతివంశమున రుద్రదేవుని, గణపతిదేవుని ప్రశంసించి, రేచర్ల రుద్రిరెడ్డిని తన తండ్రిని తనను గూర్చి కూడ జెప్పుకొనును. శాసనము గద్యపద్యాత్మకము.

శాసన మూలము

1.ఉ. శ్రీమదమూల్యదానజలసేవకుం బాయక భ్రామ్యదుష్టట్పద
స్తోమనినాదము స్వనుచు సూరెల నెప్పుడుం బ్రస్తుతింపు సి
ద్ధామరకోటికి న్వరదుండైన గణేశుండు సుస్థిరస్థితిం
గామసమానమూర్తియగు కాటయకీవుత మిష్ట సంపదల్.

2 క. చరణ సరోరుహ రాగ
స్ఫురణ న్మహిమని శిరంబు వొలుపుగ సంధ్యా
భ్రరుచి నెరయ మెట్టిన స
త్కరుణాన్విత దుర్గి వరము గాటయ కొసంగున్.

3.క. ఉరగేంద్ర దిగ్గజములకుం
బరమోత్సాహముగ నాతపత్రముపోలె
న్గ యెత్తిన కిరివరుండను
హరి గాటయ కీవుతము దయామతి శుభముల్.

4.క. దేవాది దేవుం డమిత
స్థావరజంగమము యుంకు సర్వేశుండు గౌ
రీశుండ నవరతంబును
నీవుతం గాటయకు దయ నభీష్ట ఫలంబుల్.

5.క. హరిదశ్వం డజాచ్యుతశం
కరమూర్తి ద్రయీమయుండు గమలాప్తుండు లా

స్కారుండు దయంగామచుండెకుం
గరుణారసపూర్ణ హృదయుం గాటయ ప్రీతిని.

6.గద్య. స్వస్తి శ్రీ మదపార పారావార పరిశ్రవు (వృ)త మహీతలంబున సకల జన వినుతంబగు నంధ్రదేశంబునకు విభూషణంబైన యనుమకొండయను పురవరంబు నిజరాజధానిగా నొప్పుచుంన కాకతె భూపాలక్రమంబున జనవినుతయశోవిలాసుండును నైన రుద్రనరేంద్రను పుత్రుండును సదారాధిత త్రినేత్రుండును విబుధజనవనవసంతుడును రమణీయ్య సీమంతినీ జయంతుండును సకలజనమనోరంజనుండును నరాతి రాజ మదభంజనుండును శరణాగత శరణ్యుండును వినుతాఖిలరాజ వరేణ్యుం డును ధైర్యామరసానుమంతుండునుం దురగరేవంతుండును సత్యహరి శ్చంద్రుండును విభవామరేంద్రుండును నైన గణపతిదేవమహీనాథునకుం బ్రధానియై

7.క. కనకాచలధీరుండు జన
వినుతచరిత్రుండు గార్యవిదుం డినతేజుం
డనఘుండు గుణనిధి బెజ్జమ
తనయుండు బుధదీనభానుతనయుండనగాంన్.

8.మ. ప్రతిపక్షక్షితిపాలకుంజరమదప్రారంభసంరంభ ము
ద్ధత బాహానిహిత ప్రచండ నిశితోద్య త్ఖడ్గధారానఖా
హతిభేదించి యఖర్వగర్వబలశౌర్యస్ఫూర్తిం గంఠీరవా
కృతియై సన్నుతవిత్తిదాల్చి వెలసెను రేచెర్ల రుద్రుం డిలన్.

9.గద్య. సకల జన వినుత యశుండును గుణగణాలంకారుండును నైన కామిరెడ్డికి సౌభాగ్య సౌందర్యచాతుర్యంబులం గలిగి పరగిన పరమ పతివ్రతయైన బెజ్జమాంబకు ప్రియనందనుండును ననవరతధర్మసమేతుండును పతిహితా చరణుడును గాకెత రాజ్యభారధౌరేయుండును సద్గుణప్రఖ్యాతుండును నతుల బలపరాక్రమసమన్వితుండును నైన రేచెర్లరుద్రుం డుప్రధా॥

10.క. కులతిలకుండు వసుధామర
జలధిసుధాకరుం డశేషజననుతచరితుం
డలఘుండు రిపుతరుదావా
నలుం డనంగా బరగె రాజెనాయకుం డుర్విని.

11.గద్య. బొక్కెరలోని వీరభటావలి వధించి గోధుమఱతి తలదెంచి ఉదగిరి సాధించి పడిరాయనిందోలి దాక్షారామభీమేశ్వరదేవర కక్షయదీపంబు లునిపి ధర్మసమేతుండైన రాజెనాయకునికి ధర్మపత్నియు సుచారిత్రయు వనితాలలామయునైన రవ్వమాంబకు సుపుత్రుండు

12.క. స(శ)రనిధి గంభీరుండు సు
స్థిరతేజుండు వంశశేఖరుండు దయా
కరుండు బుధాంబుజదళశత
కరుండని వర్ని(ర్ణి)ంపనొప్పు గాటయ ధాత్రిని.

13.గద్య. విశదయశుండైన గణపతిదేవ భూపాలునకుం బరమభక్తుండై తన్మహీనాథు కారుణ్యంబున నతులవిభవ సమేతుండై వనంబులొప్పంబెట్టి తటాకంబులు శివాలయంబులు నిలిపి వినయవివేకసత్యశౌచత్యాగ భోగబలాక్రమంబుల జనవినుతుండై యభీష్టార్థప్రదుండగుచుంన త్రిలోకారాధ్యుండైన పరమేశ్వరున కంగభోగార్థంబు దనయిచ్చిన వ్రి(వృ)త్తులు శాశ్వతంబై ప్రవర్తిల్లుచుండని నిల్పిన సంవత్సర సంఖ్య శకవర్షంబులు ౧౧౫౭ మన్మథ మాఘశుద్ధ ౧౫ గురువారమునందు పంచలింగాలకూను పించఅపిల్లిని దేవబ్రహ్మణ వ్రి(వృ)త్తులుగాక సర్వసమన్యయముగా నిచ్చె. (మఱికొన్ని దానభాగములుగూడ జెప్పబడెను).

విశేషములు:- ఈ శాసనమునాటికి తెలుగు రచనయందు ముఖ్యముగ శాసనములలో పూర్వముండెడి లోపములనేకము తొలగిపోయెను. నిర్దుష్టమగు గ్రాంథిక భాషను సామాన్యులుకూడ నర్థము జేసికొనగలిగియుండిరి. అరసున్నకు బదులు పూర్ణానుస్వారమునే యింకను వాడుచుండిరి. ఛందస్సునకనుగుణముగా దాని నుచ్చరించుటగాని విడుచుటగాని చేయువారు. వ్రట్టువసుడికి బదులు ఇకార

గుడినిచ్చి క్రింద క్రావడిని వ్రాయుట సాధారణముగ గనుపించును. 'వృత్తి'ని 'ప్రిత్తి' అని వ్రాయుట అట్టిదే.

## 23. వర్ధమానపుర శాసనము

శకము 1167; (క్రీ.శ. 1245)

తెలంగాణా శాసనములు II, పు. 107

సంస్కృత విభాగమునందీ శాసనమును గూర్చి చెప్పియుంటిని. గణపతి దేవుని సేనాపతులలో మల్యాల గుండయ యొకడు. నాగర కర్నూలు దగ్గర వర్ధమాను (వర్ధమాన) పురమితని రాజధాని. ఇతని యాస్థానమునందు ఈశ్వరసూరి కొడుకగు మయూరభట్టు ఈ శాసనమును ముందు కొంత భాగము తెలుగులోను ఆ తరువాత భాగము సంస్కృతములోను రచించెను. ఈ మయూరభట్టుకొడుకు రెండవ ఈశ్వరార్యుడు. ఇతడు బూదపూరు శాసనములు వ్రాసెను. ఇదియొక పండితవంశము. పదవాక్య ప్రమాణజ్ఞుల, చిత్రకవిత, బంధకవిత వ్రాయ నేర్చిన దిట్టలు (సంస్కృతములో). వీరి శాసనములందు తెలుగు భాగములలో గద్యయే కాని పద్యములు లేవు. కనుక వారికి తెలుగు కవిత్వములో ప్రావీణ్యము లేదని తోచును. లేదా అది ఆనాటి పండిత సంప్రదాయమో.

తెలుగు భాగము

స్వస్తి. సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అనుమకొండపుర వరాధీశ్వర మూరురాయజగదాళ విదితవిక్రమశీల పరమమాహేశ్వర వీరలక్ష్మీనిజేశ్వర చలమర్తిగండ కదన ప్రచండ శ్రీస్వయంభుదేవ దివ్య శ్రీపాదపద్మారాధక పరబలసాధక నామాది సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహా మండలేశ్వర కాకతి గణపతిదేవ మహారాజులు ఒరంగల్లు మొదలి పట్టణంబుగా సుఖసంకథా వినోదంబున పృథివీరాజ్యంబు సేయుచుండంగాం దత్పాద ప్రసాదాసాదితరాజ్యలక్ష్మీనివాసుండును విమతవిలాసుండును సంకశ పురాధినాథ రిపుతిమిరమార్తాండుండును బెడముట్టుగండండును వీరవితరణగుణగణాలంకారుండును సుచరిత్రవ్రతాచారుండును బాచాంబి కోదరక్షీరపారావారసంజాతహరిచందనుండును భాచవరూథినీశ

వరనందనుండును అసిముసలకణయ కంపణ ముద్గర తోమరముషిండి భిండివాల చక్రక్రకచ నారాచకార్ముకాద్యనేకాయుధ ప్రవీణుండును ననవరత పరమ కల్యాణుండును దుష్ట తురగరేఖారేవంతుండును వారనారీ యౌవన వనవసంతుడును వీణావేణు తాళకాహళ తుణవ పణవ పటహ మృదంగా ద్యనేక వాద్య కుశలుండును వివిధకీర్తి విశాలుండును సంగుప్పాంబా మానస సరోవర విహరమాణ రాజహంసుండును నిజకులోత్తంసుండును సముత్పాదిత దీనానాథ చిత్తవికాసుండును నిర్మల నిఖిల ధర్మావాసుండును శ్రీ విశ్వనాథదేవ దివ్యశ్రీపాద పద్మారాధకుండును రిపుకుల భేదకుండునునైన శ్రీ మన్మల్యాల గుండదండాధీశ్వరుండు మంత్రి పురోహిత దౌవారిక మహాప్రధానానంతసామంత సుభట విటవిదూషక పాఠక పీఠమర్ద నట నర్తక రసికరంజక కవిగమకి వాదివాగ్మి వందివైతాళిక హావక భావక గాయకాద్యనేక విద్వజ్జనంబులు గొలువ సుఖోపవిష్టుండై యిష్టకథా వినోదంబుల నుండి పదవాక్యప్రమాణప్రమేయ విచిత్ర కవిత్వ తత్త్వజ్ఞుండును నాత్రేయగోత్ర పవిత్రుండును నీశ్వరార్యపుత్రుండునునైన యభినవ మయూర సూరిం గారుణ్యదృష్టిం జూచి వర్ధమాన పురంబునందు శ్రీ నాగేశ్వర దేవరకుం బ్రాకారగోపురోపేతంబైన విలసితాయతనంబు నిర్మించి శకవర్షంబులు ౧౧౬౭ వర్తింపంగా విశ్వావసు సంవత్సర పుష్యబహుళ పంచాదశీ శుక్రవారం నాండు సూర్యగ్రహణ కాలమున నంగరంగ భోగార్థంబై పిన్నలట్టిపల్లి సర్వ నమస్యంబుగా సమర్పించి తద్ధర్మ సంరక్షణార్థంబుగా శాసనంబు సెప్పించిన దత్త్వారంభం బెట్టిదనిన—ఇటనుండి సంస్కృతము.

శ్లో॥ శ్రేయస్తనోతు వశ్శంభు ర్యన్మౌ శావైందవీ కళా ।
ధత్తే గతాస్త్రపంచేషుముక్త కార్ముకవిభ్రమమ్ ॥

(పంచబాణుడు తన అయిదు బాణములు వ్యర్థముకాగా విసుగెత్తి చేతిలో మిగిలియున్న ధనుస్సునే ఆ శివుని శిరస్సుపై విసరెనా అనిపించు చంద్రకళ గల శివుడు శ్రేయస్సు నొసగుగాక.)

పై గద్యము తుదిలో 'శాసనంబు సెప్పం బంచిన దత్ప్రారంభం బెట్టి దనిన' అనునది ప్రబంధ ప్రారంభమును సూచించుచున్నది. ప్రబంధాదిలో 'నాయొనర్పం బూనిన...కథాప్రారంభంబెట్టిదనిన' అని యుండుటందఱెరిగినదే. నన్నయ కూడ భారతాదియందు 'తత్కథాప్రారంభంబెట్టి దనిన' అని చెప్పెను. ఇచట మయూరభట్టు సంస్కృతములో జెప్పబోవునది నిజముగ నొక ఖండ కావ్యమే. కావ్యము పేరు గుండవీర నుతియని శాసనాంత చక్రబంధములో జెప్పి యున్నాడు. తదనుగుణముగ కృతిపతి వర్ణనము జేసి 'సుఖోపవిష్టుండై యిష్ట కథావినోదంబులం నుండి' అని చెప్పి యనంతరము తన వంశమును, విద్యను బ్రశంసించును. ఇదియంతయు ఆంధ్ర ప్రబంధాదుల యందుండు విశేష రచన.

